# విషయసూచిక

# తొలిపలుకు

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు విద్వత్కవి. ఆంధ్ర గీర్వాణ ప్రాకృత హూణేత్యాది పదునాల్గు భాషలలోఁ జేసిన యాతని కృషి తెలుఁగు నేలకుఁ గ్రొత్తగాదు. స్వతంత్రుఁడై స్వశక్తితోఁ జిన్నతవమున నే గొప్పకీర్తికి మంచి పునాది వేసికొన్న వ్యక్తి.

గద్య పద్యములను జక్కఁగ వ్రాయఁగల కవివతంసుఁడు. షాజీ, పెనుగొండలక్ష్మి, ప్రబంధనాయకులు, పండరి భాగవతము (ద్విపద), శివసహస్రము ఇత్యాది కావ్యములను రచించిన యువకకవి.

వీరి వైదుష్యముఁ జూచి హృషీకేశమున నుండు మహర్షి శ్రీ శ్రీ శివానంద సరస్వతీ స్వాములవారు "సరస్వతీ పుత్ర" అను బిరుదమును ఆశీఃపురస్సరముగఁ బ్రసాదించిరి.

"సంగీతమపి సాహిత్యం సరస్వత్యా స్తనద్వయ" మ్మన్నట్లు సంగీత భరత నాట్యములందును వీరి పాండిత్యము సామాన్యమైనదిగాదు. వేయేల పుట్టపర్తి తెలుఁగు నేలలో నొక ప్రత్యేకవ్యక్తి. ఈ గ్రంథము నందు నాల్గు కథలున్నవి. విభిన్న చిత్తవృత్తులుగల నల్గురు మహాకవులఁ దీసికొని నాల్గు రచనా గుచ్ఛముల నీ రచయిత యల్లినాఁడు.

1. భీమకవి ఉద్దండుఁడు, శాపానుగ్రహదక్షుఁడు, వరపుత్రుఁడు.

2. అల్లసాని పెద్దన కేవలలలితుఁడు, శృంగార రసమునం దభినివేశము గలవాఁడు, భోగి, రాజకీయధురంధరుఁడు.

3. సోమనాథుఁడు వీరశైవుఁడు. వీరశైవులకు స్వభావసిద్ధమైన యావేశమే యాతని స్వరూపము. కాని విరక్తుఁడు. ఈతనిశక్తి రాజసము.

4. **తాళ్లపాక అన్నమాచార్యులు** ఆతఁడానాఁడు వైష్ణవమును స్వీకరించిన యద్వైతి. తరువాత అన్నమయ్య అన్నమాచార్యు లయ్యెను.

అన్నమయ్యభక్తి సాత్త్వికభక్తి. శ్రీ త్యాగరాజస్వామికి నాల్గు శతాబ్దములముం దీయన గలఁడు. కన్నడమునకుఁ బురందరదాసు వలె దెలుఁగునకుఁ బ్రథమ సంకీర్తనాచార్యుఁ డీతఁడు.

వీరి నాల్గు చరిత్రములను రచయిత్రి సమానాభినివేశముతో రచియించిరి. ఈయన వచనరచన మిగుల రమ్యమైనది. ఈతనిని పండితునిగా నుంచుకొను భాగ్యము మాకు గల్గినది.

విద్యాశాఖాధికారు లిట్టి సద్గ్రంథములకుఁ జేయూఁత నొసఁగి విద్యార్థిలోకమున కందజేయుదురని నా యాశయము.

ఇటువంటి గ్రంథకర్తలకును, ఇట్టి గ్రంథములను లోకవ్యాప్తి జేయుటకు సంకల్పించిన ప్రకాశకులకును భగవంతుఁ డాయురారోగ్యైశ్వర్యములఁ బ్రసాదించుఁగాత.

విద్వద్విధేయుఁడు,
**సి. శ్రీనివాసరావు,** బి. ఏ., బి. యిడి.,
హెడ్మాష్టరు,
శ్రీ రామకృష్ణా హైస్కూలు,
కడప.

# ఆంధ్రమహాకవులు

## వేములవాడ భీమన

"వచియింతు వేములవాడ భీమనభంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు" —శ్రీనాథకవి

పంచారామములందు ద్రాక్షారామము చాల ప్రసిద్ధమైన క్షేత్రము. అచట సాక్షాత్కరించిన దైవము భీమేశ్వరుఁడు. భీమనాథుఁడు భక్తులపాలిటిఁ గల్పవృక్షము. శ్రీనాథకవి రచించిన భీమఖండ మీ భీమేశ్వరుని మాహాత్మ్యమే. ఇచటనే గోదావరి యేడు పాయలుగఁ జీలును.

ద్రాక్షారామమునకు సమీపమున 'వేములవాడ' యను గ్రామముండెను. దానియందు 'సోమన' యను విప్రుఁడొకఁడు గలఁడు. ఆయన నియోగి. సోమన చక్కఁగాఁ జదువుకొన్నవాఁడు. అతని భార్యగూడ విద్యావతియే. కాని యనుకూలమయిన యీ దాంపత్యమును బ్రహ్మదేవుఁడు చాలకాలము దక్కనీయలేదు. సోమన స్వల్పకాలముననే మరణించెను. వారికుండిన యాస్తి యా దంపతుల మంచితనము మాత్రమే. భర్తృ మరణానంతరము భార్యకు జీవనమే కష్టమయ్యెను. విద్యావతి యగుటచే ధనికుల యిండ్లలోఁ బాటలను, పద్యములను జెప్పి జీవించుచుండెను. ఆమెకు హాస్యప్రియత్వము సహజగుణము. దానితో నామెకున్న దుఃఖములను మఱచిపోయెను. నవ్వు—భగవంతుఁడు మానవులకొసఁగిన యొకవరము.

దారుణమగు నీ ప్రపంచమున 'నవ్వుట' యను క్రియయే లేకున్నచోఁ బ్రతిదినము నెన్నికోట్ల హృదయములు బగిలి పోయెడివోఁగదా !

శివరాత్రి యాత్రకు భక్తులు వేములవాడనుండి ద్రాక్షారామమునకుఁ బోవుచుండిరి. వారితోఁ గలిసి సోమనయు భీమనాథుని దర్శనమున కేఁగినది. శివరాత్రినాఁడు ద్రాక్షారామ వైభవ మఖండముగ నుండెను. వేదములే రూపము నటులున్న బ్రాహ్మణులు వీణాస్వరమున నమకచమకములువలికి భీమేశ్వరు నభిషేకించుచుండిరి. మఱొకవైపు శ్రీనామమంగళముగ సహస్రనామార్చనలు జరుగుచుండెను. వేఱొకవైపున యనుష్ఠాతలు పెదవులు చలింప కర్ణశష్కులుల రుద్రాక్ష మాలికలు వ్రేల మందమందముగఁ బ్రాసాద పంచాక్షరిని జపించుచుండిరి. ఇంకొకవైపున ద్రాక్షారామ గంధర్వాప్సరో భామినులు మురవారవంబుల కనుగుణంబుగ దండలాసకాది నృత్యములఁ గావించుచుండిరి. వేఱొకయెడ వాచస్పతులు, విద్వాంసులు, స్కాందపురాణ గ్రంథమున ఘట్టముల నెత్తి వక్కాణించుచుండిరి. ఆనాఁడు ద్రాక్షారామమునఁ బ్రత్యక్షముగాఁ గైలాసమే దిగివచ్చినట్లున్నది. ఆ బ్రాహ్మణులే ప్రమథులు. ఆస్త్రీలు దేవకాంతలఁ దలఁదన్నుచుండిరి. సోమనభార్య యీవేడుకల నన్నిఁటిని విలోకించుచుండెను. ఆమెకు హాస్యప్రియత్వ మెంతగలదో భక్తియు నంత గలదు.

ఒకవైపున స్త్రీలు సంతానప్రాప్తికై భీమనాథుని ఎదుట ప్రాణాచారమున నుండిరి. ఈ దృశ్యమును సోమన భార్యయుఁ జూచినది. ఆమెకు భీమేశ్వరునితో సైతము బరియాచక మాడ

వలె ననిపించినది. తనకును సంతానముగావలెనని యామెప్రాణా చారము గావించెను. తనకెట్లును సంతానముగలుగదని యామె యెఱుఁగును. చుట్టునున్న యమ్మలక్కలదేమియని నవ్వులాడిరి. వారందఱు నవ్వవలెననియే – యామెయభిలాష. మీకందఱకు భీమేశ్వరుఁడు సంతానము నిచ్చినపుడు నాకుకూడ నొసఁగును లెమ్మని యామె నవ్వినది. భీమేశ్వరుఁడు బ్రత్యక్షదైవము; సత్యప్రతిజ్ఞగలవాఁడు. మంచిదియో చెడ్డదియోగాని – యామె పూర్వజన్మకర్మము గూడ నప్పటికిఁ బరిపక్వమైనది. లీలా మయుఁడగు బరమశివుఁ డామెనాశ్రయించి యొక వింతనాటక మును బ్రపంచమునకు జూపఁదలఁచెను. ఉత్సవములు ముగిసి నవి. ఎవరిదారిని వారు పోయినారు. సోమనభార్యయు వేముల వాఁడకుఁ దరలి వెళ్ళెను.

ఒకనాటి యఱనిదురలోఁ గనులుమిఱుమిట్లు గొలుపు నొక మహాజ్యోతి దన యుదరము బ్రవేశించినటు లామె గలఁ గనెను. ఆ కల నిక్కమే యయ్యెను. ఆమెకు మాత్ర మది స్వప్నస్థితిగనే యుండెను. ఆ స్వప్నమును గుఱించి యామె యాలోచింపనేలేదు. ఏదో మతిభ్రమతో నేర్పడిన యొక దృశ్యమనుకొనెను. అట్లు కొన్నిదినములు గడచెను. ఆమె వఘుముబలిసినది. నీలోత్పలములవలెఁ జూచుకములు నల్లబాఱఁ జొచ్చెను. ఆ పడతి యాశ్చర్యమునకు మేఱలేదు. ఇది యెట్టిసన్నివేశము! తనకిటు గర్భముగల్గ నేమికారణము? కలనిజ మగుట దనకర్మముగాక మఱేమి? ఇకఁదన్ను జాతిజను లేమం దురు? భీమేశ్వరా! నీచిత్రనాటకమున కీయభాగ్యురాలే దొరకి నదా? అనియామె యెన్నియోరీతులఁ బనవి పనవి యేడ్చినది. ఆ భీమనాథుఁడు బలుకనేలేదు. ఈవృత్తాంతముక్రమక్రమముగా

నాఁడువారి నోళ్ళకెగబ్రాకెను. ఆఁడువారికొకమాట తెలిసినచో చీమయంతటి వృత్తాంత మేనుఁగంతయగును. వాయువేగ మనో వేగములతో వాడవాడలకుఁ బరువెత్తును. కొలఁది కాలముననే సోమన్న భార్య గర్భవతియైనదని యన్నియెడలను బ్రాకి పోయెను.

ఇద్దఱాఁడువారు సేరిన నీసంచాంగమే. ఇరువురు మగవారు సేరిన నీవేళాకోళమే. ముందే దుర్భర దారిద్ర్యబాధ ననుభ వించుచున్న సోమన్నభార్యకీ యవమానము బుండుపైఁ గారము జల్లినట్లైనది. ఆమె ప్రపంచమునకేమని సమాధానమీయగలదు. తనకుఁ దెలిసి తా నేయకార్యమునకును బూనలేదు. మఱి గర్భవతియెట్లయ్యెను. భీమేశ్వరుఁడేదనమనోనాథుఁడై నాఁడు. ఈమాట నెవరు నమ్మెదురు? ఆ భీమేశ్వరుఁడు నలుగురికంటఁ బడి 'నే నిది జేసితి' నని యేల బలుకఁడు ? ఆమె కేదిక్కును గన్పడలేదు. జాతిజనులందఱు బహిష్కరించిరి. ధనవంతుల యింటి పనులు దన్నిపుడు రానిచ్చుటలేదు. ఇఁక నా యూ రామె వదలవలసివచ్చెను. ఆమెపాలిఁటికి 'దన' యని చెప్పి కొనఁదగిన యూరేదిగలదు? తనవారనఁదగిన బందుగు లెవ్వరు? దరిద్రుల కేయూరును దమదని యుండదుగదా ? బంధువులు నుండరు. సిరిగలిగిన బందుగులు బలుకరింతురు. సిరిగలిగిన నకార్యము కార్యమగును. సిరిగలిగిన సర్వముశోభనప్రాయము. ఇది ప్రపంచస్థితి. దరిద్రుల కేయూరగ జీవనమున్న నదే వారి యూరు.

సోమనభార్య వేములవాఁడను వీడినది. ఎచ్చటికేఁగ వలెను ? ఎచ్చటకైనఁ బోనేల ? ఈకపటనాటకమాడిన భీమేశ్వ రుని చెంతకేఁ బోయెదనని కంటఁదడిపెట్టుచు నామె యను

కొనెను. ద్రాక్షారామపు ద్రోనమామెబట్టెను. ఆమె వెడలిపోయిన సంగతి వేములవాడలో వెంటనే దెలిసెను. జనులందఱు గలకల నవ్వుకొనిరి. వారికి పండుగయైనట్లు పరమానందమయ్యెను. ప్రతివారియందును దోషములనెమకుట లోకస్వభావము. వారిగనుచూపుమేరలకే యందని యంతటి గొప్పతనము సంపాదించికొనునంతవఱకు నే మహాపురుషులనైన నిట్లే దోసము లెన్నుచుందురు. తరువాత వారే మహాపురుషుల జీవితఘట్టములకు భిన్న వ్యాఖ్యానము నేర్పఱచికొని వారిని గౌరవింతురు. ఎట్టివారికైనను లోకులతోడి యనుభవమింతటిదే. ఈపద్ధతి సోమన భార్య విషయమునను దప్పలేదు.

ద్రాక్షారామముననైన నామె నెవ్వరు బలుకరింతురు? అక్కడికీవార్త యామెకంటె ముందే వెళ్ళినది. ద్రాక్షారామపు గవని ద్రొక్కినంతనే యెదురుపడిన జనులెల్ల నామెను వింతగాఁ జూడసాగిరి. ఆ పడఁతి తిన్నఁగా భీమనాథుని యాలయము ప్రవేశించెను. ఆ పరమశివుని యెదుట దనకీయుపచార మేమని బలురీతులబనవిపనవి యేడ్చెను. భీమనాథుఁడు దయామయుఁడు; హెచ్చు తగ్గులు, పాపపుణ్యములు, బరిమిత తార్కికబుద్ధిగల లౌకికజనులకే గాని పరమశివునకు లేవు. అతఁడు జూచునది నిష్కల్మషమైనభక్తి యొక్కటియే. ఆయన ప్రేమస్వరూపుఁడు. ఈమె యేడ్పులకు భీమేశ్వరుఁడు జాలినగవులతో 'సిది నాలీల, నీకేమియు భయము లే'దని బలికినట్లైనది. ఆ సమయమునకే స్వామిదర్శనార్థమై యేతుగుదెంచిన యొక భక్తుఁడు ప్రోయించిన బవిరగంట భీమనాథుని వాక్యమును, గలకలముగా ననువదించినట్లైనది. ఆ కారణమున నామె హృదయమున నొకధైర్యమావేశించెను. తన వెనుక భీమేశ్వరునివలె నెవరో

నిలిచి 'భయములే' దని వీపుఁదట్టినట్లైనది. పరమేశ్వరునకు బ్రణమిల్లి యీ వనిత వెనుకకుఁ దిరిగెను. నాఁటి నుండియు నామెకు భిక్షయే జీవనము.

భిక్షకేఁగినపుడు "ఛీ ఛీ! పాడుముండా!" యని కొందఱు జీదరించు కొనుచుండిరి. ఆ చీదరింపులలో భీమేశ్వరుఁడు నిలిచి తన్ననునయించుచున్నట్లామెకుఁ బొడకట్టసాగెను. కొందఱు గొట్టవచ్చుచుండిరి. ఆ వచ్చువారు దన్ను బలుకరింప వచ్చు భీమనాథుని బహురూపములుగా నామె కర్థమగుచుండిరి. 'నిందాస్తుతులు' రెండును శబ్దమయములే. జ్ఞానభాండారము నార్జించుకొన్న భక్తులకీ రెంటియందే భేదము గానిపింపదు. నిందాస్తుతులకే గాదు, యే పదార్థములకును నే గుణముగాని, స్వతస్సిద్ధముగ లేదు. రాగద్వేషములు రెండును మానవుఁడు మనస్సులోఁ గల్పించుకొన్నవే. ఆమె దృష్టికీసమస్తమును భీమేశ్వరమయమైనట్లును, సర్వజనులును భీమనాథుని యంశీభూతములైనట్లును, వారి పలుకు లన్నియు సాయంకాల నటనారంభుఁడైన ద్రాక్షారామనాథుని యందియలరవళియైనట్లును భాసించినది. కర్మ మెట్టివారికిని దప్పదు. ప్రారబ్ధము నశించుట కొక్కటే మార్గము. అది భోగమే; కాని భక్తులపట్లమాత్ర మా భగవంతుఁడు ప్రారబ్ధ మనుభవించుచున్నట్లు గన్పడనీయఁడు. భగవంతుని కారుణ్యము ప్రారబ్ధమును నాశనమొనరింపదు. అనుభవించుచున్నను బ్రారబ్ధము ననుభవింపనట్లు దాసులచే ననుభవింపఁ జేయును.

నెలలు బూర్తిగాఁ గడచినవి. ఆమెకు గర్భవేదన మతిశయించెను. ఇల్లు వాకిలి లేని యీ పరమసాధ్వి నాఁడొక

చెట్టుక్రిందఁ గుమారుఁగనెను. ఆ వృక్ష మీజాతితిరస్కృతను బెదరింపలేదు. తాను "నీడనీయను, వెడలిపొ"మ్మని గద్దింపలేదు. తనపర్ణచ్ఛాయలక్రింద నామెకుఁ జోటొసఁగెను.

ఆ మహాత్యాగమును వృక్షమొనరించియు జ్ఞానలవదుర్విదగ్ధులగు మానవులఁ జూచి నవ్వనేలేదు. తానేమియు గొప్పకార్య మొనరింపనట్లే మౌనముగ నున్నది. సంకుచిత స్వభావముతో నొకనిరాశ్రయురాలి కాశ్రయమీయక వెడల నడచిన సమాజము ధర్మవీరులమని సంతోషించెను. ఆ ధర్మాధర్మముల నిర్ణయము భీమనాథునకే యెఱుక.

ఆ తీవ్రబాధయందే కన్నతల్లి యా పసిపాపని ముఖము వైపుఁ జూచినది. వాని ముఖమండలమున నొక జ్యోతిశ్చక్రము బరివేష్టమై చుట్టి హఠాత్తుగ మాయమైపోయెను. పసిపాపని తలపై జటాభారము, గాంగజలము, చంద్రరేఖ యామెకుఁ గనుపించినట్లయ్యెను. మరల నాతల్లి కరములతో బాలకుని మోముఁబుడపి చూచినది. పిల్లవాని యుంగరాల ముంగురులు శైవాలములభంగి దనకరములను దాకుచుండెను. ఇంతలోఁ బిల్లవాని కంఠమునుండి యొక చిఱునాగు తన్ను బుస్సుమని,.. దాకవచ్చినట్లైనది. విప్పారిన దామరల సుందరమైన దాని పడగ బ్రత్యక్షముగ నామెకగుపడెను. అంతటి బాధలోఁగూడ నామె దనకన్నులనులిమికొని చూచెను. మరలఁ బిల్లఁడే నవ్వుచున్నాఁడు. ఈ భ్రమ తనకేమియు నర్థముగాలేదు. కాని యదేదియో యొకయసామాన్యఘట్టమనిమాత్ర మామె హృదయమునకుఁదట్టినది. ఊరివారెవ్వరామెనుబలుకరింపనేలేదు. ఆతల్లి యొక్క యోగక్షేమములకు దైవమే దాత. ఊరివారందఱికి

నాఁడేదియో యొక పాదుకల సంప్రాప్తమైనటులున్నది. కాని యాలయమునందలి భీమనాథుఁడు మాత్రము విభూతి రేఖలు చెఱఁగిపోవు ఫాలముతో ఫక్కుమని నవ్వెను. ఆ పిల్లవానికిఁ బొత్తిగా గుడ్డలులేవు. ఆమె కుపచారములు లేవు. ఆ బిడ్డ కుపచారములు ప్రకృతియే గావించినది. ఆతల్లి నాలుగుఁ జిగురుటాకుల మాడ తెత్తికొనివచ్చి యాపిల్లవానికిఁ గొత్తి గుడ్డలకుమాఱుగఁ బఱచినది. వాని జుట్టును భీమేశ్వరుని కరుణ గావలిగాయుచున్నది. నాఁడామె గాలిఁదిని బ్రతికెను.

పిల్లవాఁడు క్రమక్రమముగ నెదిగి 'యయ్యా! యమ్మా' యనఁజొచ్చెను. వాఁ 'డయ్యా' యన్నపుడంతయు నామెయెదలో బాములు బారాడినట్లు గన్పడెను. బాష్పధార లోడినగట్టు గన్నులతో భీమేశ్వరుని యాలయము వైపామె జూపులు ద్రిప్పుచుండెను. బాలుఁడు నాలుగేండ్లవాఁడైనాఁడు. వాని నామె 'భీమేశ్వరా!' యని బిలుచుచుండెడిది. ఆ పిల్లవానికి నామకరణ మెవ్వరుఁ జేయలేదు. తప్పటడుగులిడు వయస్సు వానికిఁ గడచినది. ఊరిలోని వారెవ్వరా పిల్లవానిని భీమేశ్వరుఁడని పిలువరు. 'విధవ కొడుకా!' యని సంబోధింతురు. ఆ యమాయికుఁ డదియు నొక పేరనుకొన్నాఁడు. తల్లికిమాత్రము వేయిబాకు లెదలో గ్రుమ్మిన ట్లగుచుండెను. ఆమె యెవరిపైకిఁ గొట్లాడబోఁగలదు? ముష్టి యెత్తుకొను దానికి సమాజమున నేమి వెల? ఆతల్లి యేమియుఁ బలుకలేదు. తనలోననే బాధపడుచుండెను. ఆ పిల్లవానికిఁ గావ్యపాఠము దల్లియే చెప్పినది. రఘువు ధర్మనిష్ఠ, కుమారస్వామి విక్రమము, బరమ శివుని భక్తవాత్సల్యము, శ్రీకృష్ణ పరమాత్ముని రాజనీతి, నలదమయంతులకష్టదశ దల్లి పిల్లవానికినూటిపోసెను.

వాని మేధావిశేషము దేనినైనను శరవేగమున సాకర్షింప సాగెను. వాని మనస్సు విద్యుల్లత వంటిది. తల్లినోట మాట యుండఁగనే భీమన్న పాఠములను గ్రహించును. గ్రహించిన దాని మఱచుట వాని జన్మమున లేదు; ఆ పిల్లవాని వయసు మాత్రము చిన్నది. విద్యాభారమున వాని శిరమెప్పుడును నతముగా నుండెడిది. ఒకనాఁడొక పిల్లవాఁడు 'విధవకొడుకా' యనెను. ఆమాట వాని గుండెలో నెటఁ దాకినదో, తల్లిని సమీపించినాఁడు – "అమ్మా! నన్నందఱు, 'విధవకొడుకా' యని సంబోధింతురు. అదియే నాపేరగునా! 'భర్తృ మరణానంతరము బుట్టినవాఁడుగదా విధవ కొడుకు?' ఊరివారు నన్నిట్లనఁ గారణమేమి? నాతండ్రి యెవరు? నిజముదాపక పలుకు" మని వేడెను.

ఆతల్లి యేమిబలుకును! "నాయనా! నిన్నుఁగన్నవాఁడా గుడియందున్న భీమేశ్వరుఁడు. వానికి మాత్రమే నీ జనన ప్రకారము దెలియును. ఈ భీమనాథుని సన్నిధికిఁజని యడుగు" మనెను.

పిల్లవాఁడు వెంటనే గుడికిఁ బరువెత్తుకొని వచ్చెను. వాని పాలిఁటి కాతల్లి యట్లనుట యదియేమో లిబ్బి దొరకినట్లైనది. సర సర యాలయాంతర్భాగమున కేఁగి, శివలింగమును కౌఁగిలించుకొని యా భీమన్న కూర్చొనెను. ఇంతలో యాలయపుఁ బూజారులు జూచిరి. వారికన్నులెఱ్ఱవడినవి. జుట్లు ముడివీడినవి. ఆలయమునందలి పవిత్రత యంతయు నొక్కసారిగాఁ బిట్టవలెఁ బైకిలేచినట్లు వారికి భ్రమకలిగినది. శిరాన లోని కరుడెంచి కరాన వాని నావలకీడ్చి ఈ చెంపు

నా చెంప నాలుగు లెంపకాయ లంటించిరి. ఆ భీమనాథునిఁ గన్నతండ్రి యాలయార్చకుల ధాటికి భయపడినవాఁడుపోలె నేమియుఁ బలుకలేదు. ఆ కుమారుని కంటినిండ నీరు నిలిచినది. గర్భగృహము దాఁటి బయటికి వచ్చి యొకచోట పద్మాసనము వేసికొని కూర్చుండెను. "నాతండ్రి యైనచో, నాకడ కేలరాఁడు ? కుమారునిపై గన్నతండ్రి కాపాటిదయ యుండదా ? నా తండ్రి వచ్చువఱకు నేను లేవనే లేవను. ఈ శరీర మిల్లే జితికి పోవుగాక" యని తనలో భావించుకొనెను.

ఒక దినము గడచినది. ఆతఁడాకలి దప్పులకుఁ గూడ లేవలేదు. తల్లి వెదకి వెదకి వేసారినది. వాఁడెక్కడఁ గనుపించును! వానిచుట్టును జీకటి గుఱ్ఱువెట్టుచున్నది. ఆమెకుఁ జిత్తశాంతి మాయమైనది. కోటలో వెదకెను. తోఁటలు గాలించెను. కన్నవారి నడిగినది. వారు పక్కున నవ్వి "ఆ విధవకొడుకు గోయినదే మేలయ్యె లె" మ్మనిరి. తల్లిహృదయము వారేమి యెఱుగుదురు ? సముద్రపులోఁతు సముద్రమునకే యెఱుక. ఆకాశవైశాల్య మాకాశమునకేఁ దెలియును. మాతృహృదయము మాతృదేవతకే దెలియును. ఆమె నాఁడెల్ల నాహారపానీయము లంటలేదు. భీమేశ్వరుని గుడివైపున కాతల్లి వెళ్ళనేలేదు. భీమనాథునిపై నామెకుఁ దాత్కాలికముగఁ గోపమువచ్చినది. ఇల్లాలిశ్రమ గమనింపని నాథునిపై నిల్లాలికిఁ దోఁచు భావమువంటి భావ మా సమయమున నామెయెద నాక్రమించినది. రెండవరోజుగూడఁ గడచినది. పిల్లవాఁడాకలిదప్పుల కాఁగలేక కటకట బడుచున్నాఁడు. కాని లేవఁడు. అప్పుడు భీమేశ్వరునకు దయ గలిగినది. వేములవాఁడ భీమన్న యెదుట

నిలిచి, యెవరో ' పత్నా ' యని బిలిచినట్టులయ్యెను. కనులు దెఱచి చూచినాఁడు – చంద్రఖండము, గాంగధార, జటాపట లము, సర్పహారములు, డక్కా-ఢమరుకములతో నొక మహా జ్యోతి – శివనామకము తన కన్నులలోనికి జొచ్చినట్టులైనది. ఆ పరమశివుఁడు నాని జన్మవృత్తాంత మేమిచెప్పెనో! ఆ పిల్ల వాని మానస మెట్లు సంతృప్తిఁజెందెనో! "నీ నాడినదెల్ల నాటయుఁ బాడినదెల్ల బాటయు" నగుఁ బొమ్మని పరమశివుఁ డన్నట్టులైనది. వేములవాడభీమన్న, యా స్థలమునిడిచి లేచెను. ఆ సమయమునుండి భీమన్నకు స్వయంస్ఫూర్తిగల వాగ్ధార యావిర్భవించినది. భీమన్న – భీమకవి యైనాఁడు. ఆ వచ స్సున కెక్కడలేని గాంతి యబ్బెను. ఆ గుండెకు ధైర్య మల వాటయినది. సమయమునకై రంగమునదూకఁ గాచికొన్నాఁడు.

ఒకనాఁడు బ్రాహ్మణరామమునందుఁ బెద్ద బ్రాహ్మణసంత ర్పణ జరుగుచున్నది. ఊరివారందఱచటఁ జేరినారు. జాతిబహి ష్కృతురాలైన భీమనతల్లి నచటఁ బిలుచువారెవ్వరు? కుమా రున కామె మనచ్చరికఁ దెల్పినది. ఆ బ్రాహ్మణ సమారాధన వైపు బోనలవన్నది. పోయినచో వారు 'విధవకొడుకా' యని బిలిచి నిన్నవమానింతురని పలికినది. ఆతఁడును సరేలెమ్మనెను. అనఁగా నవశ్యము బోయి తీరెదనని యాతనిమాటయందు ధ్వని. భీమన సమయమునకు సరిగా సమారాధనపు గుంపులో చేరినాఁడు. వారు వీనినిజూచి 'యవతలికిఁ బొమ్మని గద్దించిరి. "నేను పోను; నా తండ్రి భీమేశ్వరుఁడు. మీ యందఱికన్న హెచ్చుకులము నాది. నాతోఁ జేరి భుజించినచో మీరును బవిత్రులగుదురు" అని భీమన్న పలికెను.

వీనిమాటలచ్చట వినువారెవ్వరు ? వారు దన్నుదుమని బెదిరించినారు. వేములవాడ భీమకవి యాప్రదేశమునుండి దూరముగ వచ్చెను. పీడ వదలినదని బ్రాహ్మణులు పరమ సంతోషమనుభవించిరి. ఆ ప్రదేశమును వదలివచ్చిన భీమన్న యూఱకుండలేదు. "మీయన్నమంతయుసున్నము. మీపప్పులు గప్పలు" నగునని గట్టిగ నఱచినాఁడు. బ్రాహ్మణులకు విస్తరులలో పదార్థములువడ్డింపఁబడియుండెను. ఆశ్చర్యకరముగనన్న మప్పుడె సున్నముగమారెను. భక్ష్యములన్నియుఁగప్పలై దుముకులాఁడఁ జొచ్చినవి. ఇఁకనాబ్రాహ్మణులకు 'దిక్కుదోచలేదు. హఠాత్తుగ నిట్లగుట కేమికారణము? ఎంతవితర్కించినను వారికి హేతువేమియు దోచినదికాదు. ఆ గుంపులో నెవ్వఁడో యొకఁడు భీమన్న యఱచిన వాక్యమువిన్నవాఁడు దూరమున నున్న యాపిల్లవాఁ డిటు లఱచెననెను. మఱికొందఱు "అవును మేమునువింటిమి. ఆవిధవకొడుకట్లఱచె"నని బై వానియాఘోషణమునకుఁ జేయూఁతనిచ్చిరి. అక్కడఁ జేరిన బ్రహ్మవృద్ధులు సాధకబాధకములఁ జర్చించి యాపిల్లవానియందంతటిశక్తి యుండవచ్చునని నిశ్చయించినారు. దూరముగఁ గూర్చున్న పిల్లవానిని వారుసమీపించిరి. ఆ వృద్ధులు వానికొక పరీక్షఁ బెట్టినారు. వేములవాడభీమన్న మరల నా సున్నమును యన్నము సేయవలెను. కప్పలన్నిఁటి నప్పములుగా మార్చవలెను. అటుల మార్చినచో నాపిల్లవానిని బంక్తిభోజనమునకు రానిత్తుమనిరి. పిల్లవాఁడు నవ్వినాఁడు. "మీరందఱు గొప్పజాతివారు గదా! మీరే మార్చుకొనగలరులెం"డని వేళాకోళమాడెను. నేను విధవకొడుకను; నాచేత నేమగునని పలికినాఁడు. బ్రాహ్మణులందఱు తెల్లఁబోయిరి. ఆనాఁటి కన్నప్రాప్తిలేనట్లు వారికిఁ

దోఁచినది. కొందఱుఁ గార్యశూరులు మరల వంటలెక్కించితమని భుజములు దట్టిరి. మరల నా పిల్లవాఁడదేమాట యన్నచో మరల సున్నమును, గప్పలును దయారుగావా! ఇంతకు నీసారి వాఁ డేమనునో; కావున వాని బ్రతిమాలుటయే మంచిదని కొందఱు వృద్ధు లాతనిఁ జేరి దీనముగఁబలికిరి. భీమన్న కా వృద్ధుల దైన్యముతో జాలి కలిగినది. తానింతకుముం దన్న వాక్యమును ద్రిప్పివేసి,

"మీాసున్న మన్నముగ
మీాకప్ప లప్పములుగ"

నగు ననెను. ఈమాటలే మంత్రమును సక్రమముగా వల్లించి నటులైనది. "అభిచారికాది క్రూరకర్మములకు మంత్రమును దలక్రిందుల జపమొనర్తురు. అదిమంత్రశాస్త్రనియమము." పై మాటలు భీమన్నయన్న వెంటనే యందఱియాకులందునువిచ్చిన మల్లెపూలతో సమానమైన యన్నముసిద్ధమైయుండెను. ఎగురు చున్న గప్ప లప్పములై యాకులయందు స్థిరముగనున్నవి.

అప్పు డా పిల్లవానికిఁ గులము వచ్చినది. ఊరిబ్రాహ్మణులా బిల్లవానిని బంక్తియం దిడికొని భుజించిరి. ఆసంగతి వాని దల్లికి గబురుపంపిరి. ఆమెయానందమునకు మేరలేదు. బ్రాహ్మణులలో నాఁటినుండి, యాతల్లికి మన్నన లెక్కువైనవి. నాఁడు వరపుత్రుఁడని యందఱంగీకరించినారు. ఆనాఁటినుండి సోమన్న భార్యగూడ, బ్రాహ్మణపంక్తికి యోగ్యురాలైనది, ఆమెజీవనము గొంత గౌరవపాత్రమైనది. ఎప్పు డేపలుకెవరిపై జారి పడునో! యని గుండెలఁ జేతఁ బట్టుకొని, వానితో మాటాడెడి వారు. కవిత్వ మమోఘముగా నాతనికి హిమాలయమునుండి

ప్రవహించు భాగీరథివలె బ్రవహించుచుండినది. శబ్దార్థములు, దాసీబూవులవలెఁ బెన్నవైచికొని యామహాకవి కంఠసీమనుండి వెలువడసాగెను.

అన్నాఁటినుండియు వేములవాఁడ భీమేశ్వరుఁడుద్దండుఁడై రాజసభల నలంకరించుచు వచ్చెను. కవిత్వమే వానికిజీవనము. ఎట్టికవిత్వమునందైన నీతఁడు బ్రసిద్ధుఁడు. అందుచే నీతనిఁ గవిరాక్షసుఁడనియు, నుద్దండకవి యనియు జనులు బిలుచుచు వచ్చిరి. భీమనకవి రాజసభలకు వెడలినపు డంతయుఁ దాను ద్రాక్షారామభీమేశ్వరుని పుత్త్రుఁడననియే చెప్పికొనుచువచ్చెను.

ఒకసారి భీమకవి రాజకళింగగంగు దర్శనార్థమై చనియెను. ఆ సమయమున నా నరపాలుఁడేవియో తొందర పనులయందు మునిఁగియున్నాఁడు. సహజముగ రాజులుగర్వగ్రంథులు; లక్ష్మి యొక్క సన్నని నీలిపొరను రాజుల కన్నులకుఁ గప్పియుండును. ఆ నీలిపొర చిన్నపెద్దల తారతమ్యమును గమనింపనీయదు. వేములవాఁడ భీమకవి నా రా జేదోయొక భిక్షార్థమై వచ్చిన సామాన్య మానవునిగా నర్థముజేసికొన్నాఁడు. ఇప్పుడు దీరిక లేదు. సందడిదీరినవెనుక రమ్మని యా కళింగగంగు గసరి కేక వేసెనఁట! వేములవాఁడ భీమనాథున కాగ్రహకారణమైనది. కవియొక్క కుపితవాక్యము పాదతాడితమైన కోడెనాగుసిధాన వానిపైఁబడినది.

"ఉద్ధతుఁడగు వేములవాఁడ భీమకవి నీ కళింగగంగు వీక్షించి సామముమాని సందడిదీరినవెనుక రమ్మన్నాఁడు. వీని మోమును నేనిఁక జూడను. ముప్పదిరెండు దినముల కావల

యఋజాము జరుగకముందే పీనిసంపద శత్రులఁ బాలగుఁగాత"
మను నర్థమొసఁగు బద్యమును భీమకవి వలికినాఁడు.

తరువాత రెండుమూఁడు దినములలోనే రాజకళింగ గంగునకు శాత్రవులతో యుద్ధము తటస్థమయ్యెను. వాఁడు బూర్తిగాఁ బరాజితుఁడైనాఁడు. శత్రువు లా రాజ్యము నాక్రమించినారు. రాజకళింగగంగు శత్రుభీతిచే మాఱువేసము వేసికొని, యూరూరఁ దిరుగుచు, భిక్షుకుఁడై, గాలక్షేప మొనర్చుచున్నాఁడు. ఒకనాఁడు హంసతూలికా తల్పమునం దష్టవిధ సౌఖ్యము లనుభవించుచుండిన సార్వభౌముఁడు గవి శాపాక్షరములచే రాజ్యవైభవము దగ్ధమై మాఱువేసము వేసికొని బొట్టకూటికై యూరూరఁ దిరుగుచున్నాఁడు. కవి వరేణ్యుల వాక్య మట్టిదిగదా !

రాజకళింగగంగొకసారి యూరూరఁ దిరుగుచు ద్రాక్షారామమునకు వచ్చుట తటస్థించెను. నాఁడు రాత్రివేళ గగనతల మంతయుఁ గాటుక బూసికొని యున్నది. కళింగగంగు గుమ్మనుకడ నాఁగి "మాతా! భిక్ష" మనుచున్నాఁడు. అట్లు బికిరమెత్తుచు వేములవాఁడ భీమకవి యింటివాకిటికి వచ్చెను. ఆ యింటిముందఱ నొక పాతరగోయి యుండెను. కటిక చీకటిలోఁ గన్నులు దెలియని రాజకళింగగంగా పాతరలోఁ జారిపడినాఁడు. కాలికిఁ బెద్ద దెబ్బదగిలెను. తలకొక రాయి గొట్టుకొనెను. రాజకిరీటమునకు యోగ్యమైన వాని నిటాలముపైని రక్తపుమరకలు ! రాజకళింగగంగున కొక్కసారి కడచిన సుఖములన్నియు భావవీథిలో మెదలెను. ఆసుఖములకుఁ జరమభాగమున బ్రళయభైరవమూర్తి, భీమకవి

మొదలుచున్నాఁడు. నిట్టూర్పులు దొరలు తెరలై వచ్చినవి. "ఆహా! ఒకనాఁటి మహారాజఁట! నేటికి గాలిదివ్విటియైన లేదఁట! మహాకవి వాగ్వజ్ర మొక మహారాజు జీవితమునే బూడిదొనర్చిన"దనుచు రాజకళింగగంగు బాధలోనఁబడెను. అదే సమయమునకు సరిగా భీమకవి పాదప్రక్షాళనమునకై బయటికి వచ్చియుండెను. ఈదీనవాక్యము లాతని చెవినిబడినవి. గట్టిగా 'నెవరది' యని హెచ్చరించెను. ఆ వేళకు సరిగా నాకసమున దళుక్కుమని యొక మెఱపు మెఱసెను. ఆ మెఱుఁగు వెలుఁగులో కిరీటహీనమైన కళింగగంగుయొక్క నగ్నశిరస్సు మహాకవి కంటఁబడినది. పడుటయేఁ దడవుగా రాజ్యచ్యుతుఁడైన మహారాజు భీమకవి వాక్యమునకుఁ బ్రత్యుత్తరముగా "నేను వేములవాఁడ భీమేశ్వరుఁ డొనర్చిన జోగి" ననెను. అనుచునే యలికభాగమునఁ గారుచున్న రక్తము, నెడమచేత విదలించివేసినాఁడు. ఆ నగ్నమైన రాజుశిరస్సు, నిటాలమునఁ గారుచున్న యా రక్తపుఁజినుకులు, వాని నారాజు వలకేల విదలించిన దృశ్యము వేములవాఁడ భీమన్న కంటఁబడినది. ఆతఁడు దీనదీనముగా నొసఁగిన యుత్తర మా మహాకవి చెవిని బడినది. కవివరేణ్యుని యెద గదలెను. వెంటనే "రాజకళింగగంగా! వేయిగజములు బదివేల తురంగములు గల సేన మరల నిన్నుఁ జేరుఁగాత! నీ ముఖ్యపట్టణమగు సజ్జనగరమునఁ బట్టము గట్టుకొందువుగాత! మీనమాసమున బున్నమవెళ్ళినఁ షష్ఠినాటికి నీవు రాజవౌదువుగాత! కవిరాజ భయంకరమూర్తి యగుభీముఁడు, నిన్ను మరలఁగిరీటాధిపతిగాఁ జూడగలఁడుగాత! హా" మ్మని యాశీర్వదించెను. అంత రాజకళింగగంగు వరకవి పాదములకు నమస్కరించెను. తరువాత రాజు మాఱువేస

ముతో వీధిభాగవతులఁ గలసి, తన ముఖ్యపట్టణమైన సజ్జనగర మునకు వెడలిపోయెను.

రాజకళింగగంగునోడించి సింహాసనమెక్కిన శత్రురాజున కొక విచిత్రమైన బుద్ధిబుట్టినది. వీధిభాగవతులతో రాజకళింగ గంగువేసము వేయించి వానిని దనకొలువులో నవమానింప వలెనని వానియూహ. ఈ యాలోచనలో నాతఁడు వీధి భాగవతులను కొలువున కాహ్వానించెను. రాజదర్బారునకుఁ బిలువఁబడిన వీధిభాగవతులలో మాఱువేసముతోనున్న రాజ కళింగగంగుగూడ నుండెను. ఈతనిముక్కు, మొగము నున్న తీరుఁజూచి ఈతఁడే కళింగగంగు భూమిక నభినయించుటకుఁ దగినవాఁడని భాగవతులు నిర్ణయించిరి. వానికి రాజవేసము వేయఁబడెను. అచ్చముగఁ గళింగగంగున్నట్లే యున్నాఁడని యందఱు మురిసిరి. రాజకళింగగంగు కళింగగంగుగాక మఱే మగును ? కొలువెల్ల విచ్చిన దామరవలె నిండుగా నున్నది. శత్రురాజు సింహాసనముపైఁగూరుచున్నాఁడు. రాజకళింగగంగు వేసమువేసిన కళింగగంగు గుఱ్ఱము నారోహించి చేతఖడ్గము పట్టికొని, గుఱ్ఱమును గదముద్రొక్కించుచు, జక్కగా నాట్య మాడుచుండెను. కొలువునందున్న సభికులందఱు నాట్యమునకు సంతోషించి, తలలూఁపుచున్నారు. రాజకళింగగంగునకు, బాగుఁగ నవమానమైనదని పట్టలేని సంతోషమునఁ బరవశుఁడై శత్రురాజు రతనంపుగద్దియపైఁ దూగుచున్నాఁడు. ఆ తూగులో రాజకళింగగంగు చేతిలోని పిడిబాకు వాని పొట్టలో దూరినది. కెవ్వని కేకతోఁగూడ వాని ప్రాణములు పై కెగసిపోయినవి. ఆ మొండెమును గాలఁ దన్ని కళింగగంగు వజ్రాలగద్దెపై గూర్చున్నాఁడు. ఆతఁడు చేయెత్తి సభికుల నాహ్వానించి తానే

పూర్వరాజునని యెలుగెత్తి చాటెను. ప్రజలందఱకుఁ గళింగ గంగుపై నాదరాభిమానము లెక్కువ. కళింగగంగు రాజ య్యెనని కొలువులోనివారెల్లరు సంతసించిరి. కవివరేణ్యుని తిట్టువలెనే దీవనయుఁ జరితార్థ మైనది.

రాజనరేంద్రుని తరువాతఁ జోళులు వేగిదేశము నాక్రమించిరి. ఆనాఁడు జాళుక్యవంశజుఁడగు చొక్కరాజాంధ్ర దేశమున కేలిక. వేములవాఁడభీమకవి యీ చొక్కరాజును దర్శింపనేఁగెను. అప్పు డా రాజుద్యానవనమునం దుండెను. ఆతఁడు మల్లెసాల స్తంభముపైఁ గాలు జాచికొని కూర్చొని యుండెను. దర్శనార్థమై వచ్చిన భీమకవి సగౌరవముగ ద్వార పాలకునిచేఁ బ్రవేశపెట్టఁబడెను. ఆచొక్కరాజు కవివరేణ్యునిఁ గాంచి "తమరు శాపానుగ్రహదక్షులని విన్నారము. ఈ మల్లె సాల స్తంభమును మరల నెప్పటివలె వృక్షముగ మార్చఁ గలరా!" యని ప్రశ్నించెను. అడుగుటయే దడవుగ భీమకవి "అసితాభ్యుపదాన శృంఖలపదాభ్యాలంబిత స్తంభమా! నేను నిక్కముగ భీమేశ్వర వరప్రసాద సంజనితుఁడనైనచో వేములవాఁడ భీమకవినేయైనచోఁ బల్లవ, పుష్ప, ఫలభరిత శాఖాసహస్రములతో ముందటివలె మారు" మనునర్థముగల పద్యము నెలుఁగెత్తి పలికెను. ఆశ్చర్యకరముగ నా స్తంభము జిగిర్చిపత్రములతోడను, గొమ్మలతోడను, బుష్పములతోడను బూర్వమరణ్యమందున్నటులేయొకమహావృక్షమైనది. అక్కడ నున్న పరివారము మహాకవియొక్క శాపానుగ్రహ దక్షత కబ్బురపడిరి. కాని చొక్కరాజుఁ గాలుమాత్రమా వృక్షమునం దిఱికికొన్నది. ఆతఁ డా బాధతో పశ్చాత్తప్త హృదయుఁ డయ్యెను. ఇఁకమీఁద మహాకవులతోఁ బరియాచకమూడ

వనియు, స్తంభమునం దిఱికికొనియున్న కాలుయథాప్రకారము వెలికి వచ్చునటు లనుగ్రహింపుమనియు నాతఁడు దీనుఁడై ప్రార్థించెను. "ఇఁక నెన్నటికిని కవులతోఁ బరిహాసమాడ" నని భీమకవి - వ్రాసిచే మూఁడుసారు లనిపించెను. తరువాతఁ దిన్నగా, నీయర్థముగల పద్యమును వలికినాఁడు. "ఓ మహా వృక్షమా! శంభు వరప్రసాదమున నేను జనించితిని. నా వాక్కు ప్రళయకాలానల జ్వాలవంటిది. సూర్యచంద్రులుగతు లే దప్పుదురుగాక; నా వాక్కు వితఁ గారాదు. శాఖాసహస్ర ముల నుజ్జగించి నీవు మరల సామాన్య స్తంభముగనే నిలు వుము." మరల యథాపూర్వకముగ నావృక్షము స్తంభ ముగ మాఱెను. భీమకవికిఁ జొక్కరాజు జాంబూనదాంబర ముల నొసఁగి సత్కరించి పంపివేసెను.

భీమకవికాలమున గుడిమెట్ట గ్రామమును బోతరాజను నతఁడు పాలించుచుండెను. ఈతఁడు పెద్దాపుర సంస్థానాధిపతు లగు వత్సవాయవారికి మూలపురుషుఁడు. ఈ గుడిమెట్టయను గ్రామము కృష్ణామండలములో నున్నది. నందిగామకు నైరృతి దిశను - నాలుగు క్రోసులదూరమునఁ గలదు. ఇది పూర్వము చోళవంశరాజులలో నొక తెగవారికి రాజధాని. గుడిమెట్ట రాజైన పోతరాజునకుఁ ద్యాగియను కీర్తియుండెడిది. ఆకీర్తి భీమకవిని బోతరాజునుజూడఁ బ్రేరేపించెను.

వేములవాడ భీమకవిదగ్గఱ నొక మంచిగుఱ్ఱముగలదు. ఆ నాఁటి ప్రయాణములు హయములపైననే సాగుచుండినవి. ఆ గుఱ్ఱముపై భీమకవి గుడిమెట్టకు వెళ్ళినాఁడు. భీమకవి రాజదర్శనార్థమై వచ్చెనని పోతరాజునకుఁ గబురువెళ్ళినది.

వాని నపుడు బూర్వకర్మకొలఁది రాజగర్వ మావేశించెను. "వచ్చినకవి తానై రాక గబురంపుటయేమి! బిచ్చగానికింత గర్వమా! మా సంస్థానములఁ గవితలు బాడి, మమ్ము మెప్పించి, నాలుగురాళ్ళు సంపాదించుకొని బొట్టఁబోసికొనెడి కవులకే యింత యతిశయమున్న దాతలైన మాకెంత యుండవలెను! ఈతనిసంగతి చూడవలసినదే" యని తలఁచెను. కవి కుగ్రాణమునుండి బత్తెమురాలేదు. భీమకవి రాజువాలకము, ముందే గమనించినాఁడు. అయినను, వేగిరపాటేల యని శాంతము వహించినాఁడు. రెండు మూఁడు దినములు గడచినవి. భీమన్న నెవరు బలుకరింపలేదు.

ఇంతలో వేములవాఁడ భీమకవి గుఱ్ఱము – రాజుగారి చేనిలో మేయుచుండెను. పోతరాజున కీ వర్తమానము వెళ్ళినది. ఆతఁడు సాకుదొరకెనని సంతసించి దానిని బందెలదొడ్డికిఁ దోలించెను. భీమన, తనగుఱ్ఱమునకై వెదకింపగా నది బందెల దొడ్డిలోఁ బడినదని దెలిసినది. 'ఫుల్లరి' యిచ్చి విడిపించుకొని రావలసినదని మహాకవి దన సేవకునిబంపినాఁడు. 'ఫుల్లరి' ఇచ్చెద మన్నను గావలివాఁడు దానిని వదలలేదు. వదలఁగూడదని రాజుగారి యానతియైనదఁట! తనసేవకుఁడు దీనవదనముతో వెనుకకు వచ్చెను. 'గుఱ్ఱమేదిరా' యని కవి కోపకుటిలుఁడై యడిగెను. 'ఫుల్లరి' యిచ్చినను వారు విడువరఁట; పోతరాజుగారి యానతి యటులున్నట్లు గావలివాఁడనెనని, యింకను సేవకుఁడు మాటాడుచునే యుండెను.

తాల్మిపీడిన మహాకవి తన గన్నులయందుఁ దళతళమని, కోపశిఖిశిఖాస్ఫులింగములు వెలికిఁజెదర 'నేమీ' యన్నాఁడు.

సేవకున కా మూర్తి భయంకరముగఁ గన్పడినది. 'ఏమీ' యను నాసవ్వడి నేఁబదిదిక్కు లనువదించినట్లైనది. వాఁడు దిగాలుపడి కన్నులుమూసి మఱిదెఱచెను. ఆ సేవకుఁడు గన్నులుఁదెఱచులోన భీమకవి రాజద్వారమున సరసర నడచు చుండెను. పారఁజూచిన మృత్యుదేవతనాలుకలవంటి విచ్చు కత్తులఁబట్టుకొని ద్వారపాలకులు కోటవాకిలిముందు నిలువఁ బడియుండిరి. వారి కాతని భయంకరమూర్తి యేమైనదో యడ్డగింపనేలేదు.

మహాకవి ఫాలమదరుచున్నది. అదరుచున్న నిటాలము పైనిఁ జెమటబిందువులు దామరపాకుపై నీటిచలెఁ జలించు చుండెను. దక్షాధ్వర దీక్షావిధాన విభేదన విశంకట విక్రమ విభాసి భైరవమూర్తి కళారేఖ లా భీమనముఖమునఁ గన్పించుచున్నది. పోతరాజు ముందటికొలువుకూటమునబచారు సేయుచున్నాఁడు. వాని తలఁపులయందు భీమకవియేఁ దిరుగు చుండెను. "ఏమీ! ఒకసామాన్యకవికి ఇంతయతిశయమా" యని దనలో ననుకొనుచుండెను.

ఇంతలో భీమకవి వానిని సమీపించినాఁడు. పోతరాజు దనలో ముందటిదలఁపునేయామ్రేడితముసేసి 'యేమీ!' యనెను.

అంతవఱకు సేవకునే యాలోచించుకొనుచున్న భీమకవి దనకుఁ దెలియకయే యొకసారి బిగ్గరగ 'నేమీ' అనుకొన్నాఁడు. వారిరువురు నేకకాలమున భిన్నభావ ప్రేరితులై 'యేమీ' యనుకొను టా సన్నివేశమునందలి వైచిత్రి.

పోతరాజునకు వేఱొకగొంతు వినఁబడినది. ఆ శూన్య ప్రదేశమే దనభావము నెదిరించినట్లై యాతఁడు దన యాలో

చననుండి ప్రక్కకుఁ దిరిగిచూచెను. ఎదుట గృత్యవలె నున్నాఁడు భీమకవి. వానికాముఖమునందు రుద్రప్రచండకోప మొకసారి బ్రత్యక్షమైనది. విష్ణుమూర్తి సుదర్శనచక్ర మా మహాకవి ముఖమండలమున నిలిచి రారమ్మని పిలిచినట్లైన దాపోతరాజునకు. కరాళనృసింహమూర్తి యొకసారి ఘక్కుమని పగలబడి నవ్వినట్లైనది. అతఁడటులే జూచుచు నిలుచబడెను.

"నాగుఱ్ఱమును వదలు" మని భీమకవి యనెను.

"నీ గుఱ్ఱమేదీ" యని పోతరాజు గద్దించెను.

"నీ బందెలదొడ్డియందు బంధింపఁ బడినది. దానికదిగో 'పుల్లరి' గట్టికొమ్ము. నాగుఱ్ఱమును వెంటనే వదలు"మనెను.

"ఇపుడది నీ గుఱ్ఱముగాదు. మూనాళ్లనుండి దాని శరీరము నా యాహారముతోఁ బెరిగినది. దాని వాలకము నామనసును హరించినది. ఆ హయరత్నము రాజులచెంతనే యుండఁ దగినది. కనుకనే, నేను గైకొంటిని. రత్నము గాంచనముతోఁ జేరినది. ఇక నీ కదిరా" దని పోతరాజు తార్కికముగ బదులు పలికెను.

భీమనాథుఁడు వెడనవ్వు నవ్వెను. ఆ నవ్వుఁ బోతరాజు నకు మృత్యువు నాహ్వానించినట్లయినది. ఆ నగవున కనుకూల ముగ భీమనాథుని పెదవులనుండి యీ వాక్యములు వెడలినవి. "ఓయీ! నాహయము నాకళత్రము వంటిది. న్యాయముగ దాని 'పుల్లరి' గట్టికొమ్ము; రత్నము లన్నియు రాజులనుభ వింపనే బుట్టలేదు. దానికి మూనాళ్లనుండి యయిన యాహారమునకుఁ గూడ ఖరీదు గట్టుము; ఇచ్చివేయుదును. కాని నాగుఱ్ఱమునుమాత్రము నాకిచ్చివేయవలసినదే!"

రాజందుకొన్నాఁడు – "ప్రపంచమున నన్ని పదార్థములును ధనముచే వినిమయముగాఁబడవు. నిజముగాఁజూచినచోఁ బ్రపంచమున ధన మొక యల్పపదార్థము. మానసిక భావములను ధనము కొనలేదు. ఆ ధవళాశ్వమునందు నామనస్సు లగ్నమైనది. ఆ 'లగ్నత'ను నీధనము గొనలేదు. నీవు నన్నవమానించితివని నాకు ద్వేషమున్నది. ఆద్వేషమును నీధనముఁ బోఁగొట్టలేదు. మూన్నాళ్లనుండి, నాయాహారము నీహాయరత్నమరిగించుకొన్నది. దానికి ధనము సరియైన వినిమయమని నేను దలఁపను. అసలీగాథయంతటికి నీపై నాకున్న ద్వేషమే కారణము. దానిని నీవెట్లు బోగొట్టఁగలవు ? ధనము – బీదల విషయమునన్నైనను – తాత్కాలికముగ మానసికభావముల – దమించునేగాని పూర్తిగ తృప్తిసేయ లేదు."

"అయిన నీయవన్నమాట" యని కవి హుంకరించెను. ఆ హుంకారము త్రిపురదమన సమయమున ఫాలనేత్రుఁడు హుంకరించినటులున్నది.

'సేనియ'నని రాజు స్థిర ప్రతిజ్ఞుఁడై యున్నాఁడు. కవి గిరుక్కున వెనుదిరిగెను. తిరుగుచునే నీ యర్థముగల పద్యము వచెను. "ఆ హయము సీత; దురాత్ముఁడగు నీ పోతరాజు, మరణమును గోరితెచ్చుకొన్న రావణుఁడు; నిశ్చయముగ నేను రాఘవుఁడను; ఈ గుడిమెట్టయే లంక; నా జయమును బోత రక్కసుని జావును జనులేఁడవనాఁడు జూతురుగాక". కాలము దీనిస పోతరాజు రాజ్యపాత్రములకు నవ్వుచునేయుండెను. అంతః పురమున గవిశాపవార్త దెలిసినది. రాజభార్య కవిని బ్రతిమాలవలెననుకొన్నది. అంతలోననే వేములవాడ భీమకవి గుడిమెట్ట

విడిచివెళ్ళెను. పదవదినమునాఁటిరాత్రి పోతరాజు హంస తూలికాతల్పమునఁ బండుకొనియుండెను. నీలవసన, వికీర్ణకేశ, కరాళదంష్ట్ర, గర్జాభయంకరి యొక స్త్రీమూర్తి పోతరాజు గుండెలపై గూర్చుచున్నది. పోతరాజు కన్నులు దెఱచెను. ఆమె వసనపుటంచు లగ్నిమయములు. అంటినచోటెల్ల దనశరీరము గాలుచున్నది.

"నీ వెవ్వతె?" వని పోతరాజు ప్రశ్నించెను.

"కవి బంపిన మృత్యువను. శబ్దార్థములు నాగులవలెఁ బెనవైచి ఫాలనేత్రుఁడైన కవిఋషి కటికి గుండెపైకి నంపిన మృత్యువు"నని పలికి; ఆమె వాని యెదపై నొకపోటుబొడిచెను. "కవిపంపినమృత్యు" వని గెవ్వున వాఁడఱచెను. అఱచుటయే దడవు రాజనగరు మేల్కొనినది. ఊరంతయు నేమియు దోచని యరనిదురలో 'నేమేమి' యని దిక్కులుఁ దెలియక యఱచుచుఁ బాఱినది. పోతరాజుశవమునకు మఱునాఁడు శుద్ధాంతరోదనధ్వనులమధ్య యంత్యక్రియ లాచరింపఁబడినవి. వేములవాఁడ భీమకవి శాపాక్షరములు గుడిమెట్టనే మూలమట్టమొనరించెను.

ఆంధ్రసాహిత్యమునఁ గవితిక్కన నెఱుఁగనివారుండరు. కవితిక్కన యెంతటికవియో ఖడ్గతిక్కన యంతటివీరుఁడు. ఈ ఖడ్గతిక్కనను జోషించు నరనాథుఁడు మనుమసిద్ధి. ఒకసారి మనుమసిద్ధికి శత్రురాజులతో యుద్ధముతటస్థించినది. ఆయుద్ధమునందు ఖడ్గతిక్కన వైరివీరులనుగూల్చి వీరస్వర్గ మలంకరించినాఁడు. ఆ మధ్యాహ్నమే యే పనిమీదనో భీమకవి యా గ్రామమునకు వచ్చెను.

ఖడ్గతిక్కనభార్య యామహాకవికి నమస్కరించినది. మాతాత్తుగ భీమకవిముఖమునుండి 'దీర్ఘసుమంగలీభవ' యను దీవనవెడలెను. ఆమె వలవలయేడ్చినది. తనమగఁడు కొన్ని గంటలక్రితమే యుద్ధమున మరణించెనని యామగువ బలికెను. వేములవాఁడ భీమన్న యీయర్థముగల పద్యమును వినిపించెను.

"రణతిక్కన గుణముల నిధానము. అతఁడింత త్వరగాఁ జావరాదు. వానితలయు మొండెమును గలిపినఁ బునర్జీవితుఁడగు".

రణమునఁబడిన శవమును దీసికొని రమ్మని కవియాజ్ఞ యైనది. వెంటనే సేవకులు జని ఖడ్గతిక్కన శవమును మోసికొని దెచ్చిరి. కవియెదుట ఖడ్గతిక్కన శిరమును, మొండెమును జేర్చఁబడెను. నిద్రపోయి లేచినట్లు ఖడ్గతిక్కన గరమునందలి ఖడ్గమును విదలించుచు లేచి గూర్చుండెను.

వేములవాఁడ భీమన్నయింటిలో నొకనాఁడు బందుగు వచ్చెను. ఆనాఁడు భీమకవితల్లి నేతిచెంబు జేతబట్టికొని బ్రాహ్మణులకు నేయి వడ్డించుచుండెను. చెంబునకంటుకొనియున్న మసి యామె యుదరమున కంటియుండెను. భీమకవి దానినిఁ జూచి "యమ్మా!నీకడుపుమసియైన"దన్నాఁడు. కడుపుమసియైన దనఁగా సంతానము మరణించినదని వేఱొకయర్థము. తనమాట దనకే దగిలినది. భీమకవి తరువాత రెండుమూఁడు రోజులకే మృతినొందెను.

భీమకవి రాఘవపాండవీయమను గ్రంథమొకటి రచించి యుండెననియు, దానినినన్నయభట్టారకుఁడు నశింపఁజేసెననియు నందురు. ఈకథ నమ్మఁదగినదిగా గన్పట్టదు. నన్నయభట్టారకుని వంటి మహాకవికి మఱియొక్క గ్రంథముపై నసూయయుండె.

ననియు నది ప్రకటింపఁబడినచోఁ దన గ్రంథము ప్రసిద్ధికి రాదనియు శంకించెననుట చాలదోషమగును. 'రాఘవపాండవీయ' ద్వ్యర్థికావ్య మున్నంతమాత్రమున భారతమున కెట్టి లోపము గలుగును? ఏ కారణము చేనైన నేమి వేములవాడ భీమకవి రచించిన ద్వ్యర్థికావ్యము పింగళిసూరన్ననాటికే లుప్తమైనది అందుచేఁ బింగళిసూరన వేఱొక 'రాఘవపాండవీయము'న రచించెను. వేములవాడ భీమకవి వ్రాసిన ఛందస్సుమాత్ర మొకటి యిప్పుడు ప్రసిద్ధముగ వాడుకలోనున్నది. దానికి 'కవిజనాశ్రయ'మని పేరు. ఇతఁడు కొన్ని 'జ్యోతిషపుస్తకములు' వ్రాసెననియు, వానియందిప్పుడున్నవారును, మున్ను జన్నవారును, ముందుఁ బుట్టఁబోయెడివారును, నడిగిన, యడుగఁబోయెడు నన్ని ప్రశ్నములకు సరియైన సమాధానములు గలవనియుఁ గొందరందురు. కాని యవియన్నియు నమ్మదగిన మాటలుగావు. అమాయకులను మోసపుచ్చుటకై వంచకులు పలుకు కొన్ని పన్నాగములు మాత్రమే. భీమన్నచే రచింపఁబడిన 'శతకంఠరామాయణము'లోనివని కొన్ని పద్యములు లక్షణగ్రంథములం దుదాహరింపఁబడెను. ఆ గ్రంథమిప్పు డుపలబ్ధముగాదు.

వేములవాడ భీమకవి గ్రంథములగూర్చిన వాదములు లున్నను నతఁడొక యుద్దండుఁడనియు, శాపానుగ్రహదక్షుఁడనియు, కవిరాక్షసుఁడనియుఁ గాలమెన్నటికి మఱువఁజాలదు.

---

# అల్లసాని పెద్దన

ఆ ఫాలము విశాలము. తుమ్మెదల రెక్కలవలె నల్లని కాంతులనీను నా కన్నులవాలక మెట్టివారినైనను లోఁగొనఁ జాలియున్నది. విశాలమగునెద రాచరికమునకుఁ దగియుండెను. ఫాలపట్టికపైన నెలుఁగు బుండ్రాంకములు బ్రాహ్మణత్వమును సూచించుచున్నవి. విపంచీస్వర మా కంఠమునఁ గలదు. పలికినపుడంతయుఁ బ్రతిభయే దొఱలికిసలాడుచుండెను. ఆయువకుని వయస్సు సుమారు ముప్పదియుండును. వెదురుదబ్బవలె సన్ననై చక్కని యాతని శరీరము మానవునియందు దాఁగియున్న దేవత్వమును సూచించుచున్నది. ఆ మహావ్యక్తి ప్రతిపద మొక లయ. ప్రతివాక్య మొక సంగీతము. శరీరమునఁ బ్రతివంపు నొక భరతాభినయము. ఆంధ్రభోజుని గొలువుకూటమునం దొక్కనాఁ డా పుంభావసరస్వతి యవతరించినాఁడు. అన్నివిధముల నమరిన యా చక్కదనమునకు సభయంతయు వింజ మూకిడినట్లైనది. కృష్ణరాయని రత్నఖచిత సింహాసనమునకుఁ గుడివైపున నొక బంగరునగిషీల యున్నతాసన ముండెను. దానిపై మహామంత్రు 'లప్పాజీ' యధివసించి యుండిరి. వారి చూపు లీ యువకునిపై వ్రాలెను.

వ్రాలిన యా చూపులయం దాదరమో, యధికారమో, మర్మజ్ఞతయో, మఱేదియో బ్రతిఫలితమైనది. తలపంకించుచునే వా రా యువకు నిట్లు బ్రశ్నించిరి.

"వత్సా! నీవెవ్వరవు? ఏకార్యమునకై యిటకు వచ్చితివి? మహారాజుల యనుగ్రహ, నిగ్రహములు రెండును కార్యకరణ సమర్థములు. నిర్భయమునఁ బలుకుము."

ఆంధ్రభోజులు, జిఱునగవున నవ్వాజివైపుఁ జూచిరి. ఆ నవ్వులలో వారి తలపై వెలుఁగుచున్న పాగయందలి ముత్యాలజాలరు లూగిసలాడినవి. పల్లెపట్టునందలిమఱ్ఱివృక్షము వలె నకారణముగ సభ్యులందఱి యాదరమునకుఁ బాత్రుఁడైన యా యువకుఁడు నూనూగు మీసాల నూత్నయావనము దేజరిలుచున్న నావిద్వత్కవి యుదాత్తగంభీర స్వరమున నిట్లు బదులు వలికెను.

"చక్రవర్తులకు నమస్కారములు. మహామంత్రులకు వినతి. నేను తమ సేవకుఁడ. దమ రాజ్యంబులోనివాఁడ. దూపాడు పరగణాలలోని దోరాల నాగ్రామము. తండ్రి విశ్రుతచారిత్రులు, చొక్కనామాత్యులు. నాపేరు పెద్దన. నందవరీక బ్రాహ్మణులము. తమ రాజ్యంబునందలి పండిత బృందముల చెంతనే యంతేవాసిత్వము నెఱపితిని. సకలశాస్త్రములు నాకు ఘంటాపథంబులని తద్విదులు వలుకుదురు. విశేషించి తర్కవ్యాకరణంబులు నా తోడునీడలు. ఉభయభాషా కవితలు నాగూర్చు నెచ్చెలులు. తుంగభద్రాసముత్తుంగవీచీ ఘటాగంభీర ఘుమఘుమారంభములు నా రచనలఁ గలవందురు. కళసాపురప్రాంత కదళీవనాంత ద్రాక్షాలతా ఫలస్తబకములు నా శయ్యా సౌభాగ్యములఁ గమ్మదనము లూరునందురు. కర్ణాటకామినీ, కర్ణహాటక రత్నతాటంక యుగళ ధాళధళ్యములు నారచనలు. జదివినపుడు ముదురఁబండిన వెన్నెలలవలె వ్యాపించునందురు. ప్రభూ! నిరాశ్రయులైన పండితులు, వనితలు, లతలు శోభింప నేరవందురు. అది ప్రాత పంచారపుమాట; విద్యానగరమునందలి పండితుల కా యవస్థలులేవు. భువనవిజయమహాస్థానము, రసికులనెల్ల శతకోటి కరముల నాహ్వానించుచున్నది."

ఈ వాక్యములలో మహామంత్రులకు నొక నిర్భీకత, పాండిత్య గర్వము బ్రత్యక్షమైనది. రాయలమనో దృష్టి కొక శ్రీనాథుఁ డాంద్రాకాశమున దళుకుమని మెఱసెను. ఆ నుడుల లోని సరస్వతీమంజీర మంజుశింజానము లాస్థాన కవీశ్వరుల మేలుకొలిపెను. ఆశ్రయ మొసఁగుట కంగీకారసూచకముగా, రాయలచూపు లప్పాజీవదనమునవ్రాలినవి. ప్రభునిహృదయము మహామాత్యముఖమున నిట్లు వచించినది.

"మీ పాండితికి, నిర్భీకతకుఁ, జాల సంతసించితిమి. మీసన్నిధానము మా కొలువున కలంకారము."

ఇట్లు కృష్ణరాయల హృదయము నావిష్కరించి, మరల నందికొన్నారు మహామంత్రులు.

ఆశ్రిత కల్పవృక్షమగు నీ మహీపాలుని యాదర చ్ఛాయయందుఁ దావక వాగ్విలాసములు దొంతర దొంతర లల్లికొని నూత్న నూత్నమగు శోభను నించుగాత.

ఇంతలో మధ్యాహ్నకాల సూచకములై శంఖ భేరీ రవములు మిన్ను ముట్టినవి. కంతుని సతిని దిసంతులు గొట్టఁ జాలు సుందరాంగులు రాయలకుఁ ద్రోవజూపింప నిలిచిరి. కంకణ కలకల క్వాణములతో వింజామరలు వీచుచున్న గణికాసమూహము రాయలవెంట నంటి వచ్చుచుండెను. వందిమాగధుల సాహోనినాదములు దెరలు తెరలై సముద్ర తరంగముల పోలిక నుబుకుచుండెను. ఖడ్గపాణులగు భట బృందము బరాబరులు వలుకు చుండిరి. అడపములు, పాదుకలు, కళాచికలు, ముకురములు వట్టికొన్న మెల నాఁగలు ముందు నిలిచిరి. అప్సరసమూహపరివేష్టితుఁ

డగు దేవేంద్రునివలెఁ బాదములయందలి బంగరుగిలుకుపావలు కింకిణీక్వాణ వ్యాజమున విజయఘోషలుసేయ మూరురాయర గండఁడు శుద్ధాంతమునకు సాఁగిపోయెను. వారివెనుకనే మహామాత్యులు రాజకయ దీర్ఘాలోచనా భ్రుకుటిత నిటాలు రల్పపరివారముతోఁ గదలిపోయిరి. పెద్దన కపుడే పట్టు సేలువలు, నొక మేనాయు బహూకరింపఁ బడినవి. బత్తెపు ఖర్చు యుగ్రాణమునుండి బంపఁబడెను. నాఁటినుండి యల్లసాని పెద్దన యాంధ్రభోజుని యాస్థానమునందలి యష్టదిగ్గజములలో నొక్కఁడై నాఁడు. కాని, మహామంత్రులు మాత్రము పెద్దనయం దింకను గొప్పయాసలే బెట్టుకొని యుండిరి.

రాయల యాస్థానమునం దనేకులు మహాపండితు లుండిరి. లేఁ దములపాకువంటి లాలిత్యము, కామినీ గండ పాళికల జిగియు, కుంభికుంభముల బిగియుఁ బెనవేసి రచనల ముందుఁ జూపింపఁగల వాచస్పతులు శతాధికులు గలరు. తమిళకవులు, గర్ణాటకకవులును గృష్ణరాయల రాసిక్యముచే వంచితులు గాలేదు. సంస్కృత కవులు గుప్పలు తెప్పలు. గర్ణాటక కవులయందుఁ దిమ్మనార్యుఁడు ముఖ్యుఁడు. రాయల యానతితో నాతఁడు దిక్కనామాత్య కృతమగు భారత శాంతి పర్వమును గన్నడమునకుఁ బరివర్తించెను. 'అనుష్టుప్చక్రవర్తి' యను బిరుదముగల యుద్దండసంస్కృతకవియొక డుం డెను. అనుష్టుప్ఛందమున, నెంతమహార్థమునైన నిమిడించుటలో నాతఁడందె వేసిన జేయియఁట. ఆనాఁడు సంకుచితభాషావివాద ములు లేవు. ఆంధ్రకవులు కన్నడమును నేర్చి కవనమల్లఁ గలిగి యుండిరి. కర్ణాటక కవులు తెలుఁగువారి తిరుతీయముల దమ

గ్రంథముల బొందుపఱచిరి. తమిళకవులు, రెండు భాషలను సానుభూతితోఁ జూచిరి. నాఁటి సాహితీక్షేత్రమున నిది యేభాష? యను కుత్సితవిచారములేదు. ఈ రసికత కెంత వెల ? యని మాత్రమే వారు చూచుచుండిరి. అసలు రాయలే సంగీత సాహిత్యములం దాఱితేఱినజాణ. అతఁడు వీణెసారించుచుండెను.

వీణాస్వానమువంటి కవిత లల్లఁగలవాఁడు. "దేశభాష లందుఁ దెలుఁగు లెస్స" యను విశ్వాస మాతనికున్ననుదానిలో నంధుఁడు మాత్రమాతఁడుకాఁడు. ఆళ్వారులు, నాయనారులు మొదలగు నఱవకవుల భక్తిబంధురకవిత లా మహనీయుని హృదయము నాకర్షించెను. 'రన్న' కవి కన్నడమున రచించిన 'గదాయుద్ధము', పంపని 'భారతము' నావిద్వత్ప్రభువు సంతోషమునఁ జదువుచుండెను. కుమారవ్యాసుని 'భారతము' రాయలకుఁ జాలమెప్పు. తిక్కన యౌచితీబంధురమగు ఫక్కి, కుమారవ్యాసుని రసబంధుర ధాటీవిశేషము రాయల హృదయమును సమానముగా బ్రోఁగొన్నవి. ఎన్నిరీతులఁజూచిన నానాఁడాంధ్రసాహితీరంగమున నొక స్వర్ణయుగము.

కొలఁదికాలముననే, పెద్దన ప్రతిభావిశేషము కవులందఱి యందును నాయకమణివలెఁ బ్రకాశింపఁ దొడఁగెను. పెద్దన యెట్టి క్లిష్టసమస్యనైనను బూరింపఁగలఁడు. ఏ శాస్త్రచర్చ కైనను సమాధానమీయఁగల వలఁతి. ఆంధ్రసంస్కృతములు రెండు నాతనికిఁ బిలిచిన 'ఓ' యనుచుండెను. సహస్రముఖ ముల విజృంభించు నీ ప్రతిభ కెవ్వరాఁగ లేకుండిరి. సానపెట్టు కొలఁదియు జాతిరత్నము ప్రకాశించునుగదా! పెద్దన ప్రతిభ యటులుండెను. రాయలు గుణగ్రహణ పారీణుఁడు. కృష్ణ

రాయఁ డాతనికి మిత్త్రుఁడయ్యెను. శిష్యుఁడు నయ్యెను. శిరీష కుసుమ పేశలములగు పెద్దన వాగ్వైఖరులకు సౌందర్యలోలసు లగు కవులు మోకరిల్లిరి. పెద్దనకు రాజుపైఁ గల పలుకుఁబడి మహామాత్యుల కొక్కరికిఁ దక్క మఱెవ్వరికిని లేదు. ఆ యువకుని యభివృద్ధికి లోలోన నప్పాజి సంతోషమునఁ బొంగు చుండెను. కాని యాతని ప్రతిభ కవితకేఁగాక రాజకీయము లకును బంచికొనవలెనని మహామంత్రులయాస. కృష్ణరాయలు పెద్దనగారి కవిత్వమును బొగడినపుడంతయు నేదోయొక సాకు గలిపించి మహామంత్రు లాయన రాజకీయములనేర్పును దెలియఁ బఱచుచుండిరి.

అనువైన రాచటీకములు పెద్దనతోఁ జర్చించి వానిని రాయలకుఁ దెలుపు టప్పాజీకి నిత్యకృత్యమైనది. ఇంతలో నల్లసాని పెద్దన 'హరికథాసార' మను గ్రంథమును వ్రాయ నారంభించి ముగించెను. ఆ గ్రంథపఠన మొకనాఁడు కొలువున నేర్పాటు జేయఁబడెను.

సుమధుర కంఠస్వరముతో, జిలుఁగుదువ్వలువ చెంగులు మాటికి జోపికొనుచు, చిఱునగవు దుమాళించు బెదవు లల్లనఁ గదల పెద్దన యా గ్రంథమును గానమొనరించుచుండెను. ఆహా! ఏమి యా ప్రత్యక్షర ప్రతిభా ప్రసారము! ముక్కు తిమ్మన, సిగ్గున మొగము వంచెను. కవి ధూర్జటి గడలు సూచెను. మాదయ్యగారి మల్లన మనసు దిటవు చెడెను. వీరంద ఱాకాలమునందలి యష్టదిగ్గజములలోనివారే. పెద్దన కించుమించు సవయస్కులు. గ్రంథపఠనము బూర్తియైనది. రాయలు గవికిఁ గాశ్మీర సేలువలు, చీనిచీనాంబరములిచ్చెను.

కర్ణకుండలములు, మహనీయము లొసఁగెను. దిక్కుల దావిఁ బూరించు గమ్మ కస్తూరి కడవలకొలఁది యింటికిఁబంపెను. ఆ కస్తూరివాసనలకన్నను, పెద్దన కవితావాసనలు రసిక హృదయముల గుబాళింపఁజేసినవి. యౌవనోన్నతములగు నెదలు నిక్క మదవతులు బెద్దన కంఠమున గొజ్జఁగిపూదండల నలంకరించిరి. చందన తాంబూలములు, తరుణీ కర కంకణ సంగీత సరసముగా నొసంగఁబడెను. సత్కారము పూర్తియైనది. మహామాత్యులు వినయమేదురముగ రాయలవైపు చూచినారు.

"ప్రభూ! మీ సత్కారము ముగిసినది. ఈ మహాకవికి నేనొక సత్కార మీయఁ దలఁచినాఁడను. మహారాజులనుగ్రహింపవలెను. ఏమది!

ఈతని ప్రతిభ మన తుంగభద్రాస్రవంతి వంటిది. ఆ స్రవంతీమతల్లి తనశీతలజలముచే, మానవుల దాహము నార్పుట మాత్రమేగాదు. తాను శతధా విభక్తమై దేశమునంతటిని సస్యశ్యామలముగా నొనర్చుచున్నది. ఈ మహాకవి ప్రతిభయు, మన రాజకీయములకుఁ దోడ్పడవలెను. రాజకీయ చాతుర్యమీతనియందు నిగూఢముగ శమీవహ్నివలె దాఁగియున్నది. దానిను త్తేజింపఁజేయ దేవరవారి ననుజ్ఞ వేఁడెదను. నేఁడు చిదంబర ప్రాంతములకు సరియైన దండనాథులులేరు. ఆ ప్రాంతములనుండి వచ్చు వార్తలు మన పాలనమున కంత క్షేమంకరములుగ లేవు. ఆ పదవి కీ మహాకవి యర్హుఁడనుకొందును."

"సరిసరి యట్లే. నేటినుండి పెద్దనగారు చిదంబరప్రాంత్యములకు దండనాథులు."

రాయలు ముగుదనగవునఁ దల పంకించెను. ఆ నగవే మహామాత్యులందికొన్నారు. ఆత్మప్రత్యయము బొరలువోవు, పెద్దన ముఖము భావగంభీరముగ నుండెను.

"నేటినుండి కవిపెద్దనయేగాక పెద్దనదండనాథులును మనకు సాక్షాత్కరింతు రన్నమాట" యని ముక్కుతిమ్మన ఛలోక్తిని విసరెను.

"అవునవును. రాజానుగ్రహము, మహామంత్రుల దివ్య వీక్షణము కవులను దండనాథుల గావించిన" దని కవి ధూర్జటి నాలుక గఱచెను.

"ఓడలు బండ్లగును – బండ్లోడలగు" నని మల్లన సణిగికొనెను. తెనాలి రామకృష్ణుఁడు భట్టుమూర్తియు నెచట నుండిరో పలుకనేలేదు.

భట్టుమూర్తిమాత్రము మెల్లగ నీతఁడు నావిద్యాగురువని పలికినటు లుండెను.

సభయందు గుసగుస లారంభమైనవి. పలువురు బలు రీతుల వాకొనఁజొచ్చిరి. ఆ గుసగుస లన్నిఁటికి మహామంత్రుల యొక్క కలికుఁజూపు మంత్రదండ మయ్యెను. జనులందఱు జవ్వాదిపిల్లులవలె ముడిచికొనిరి. సాయంకాల తూర్యములు మ్రోయుటతో నాఁటికొలువు జాలింపఁబడినది.

రాజోచితమర్యాదలతోఁ బెద్దనదండనాథుఁడు చిదంబర మునకుఁ బ్రయాణమైనాఁడు. అదవదలైన యక్కడి పరిస్థితు లన్నియు బెద్దన తనయదుపులోనికిఁ దెచ్చికొనెను. ఉద్ధతులఁ జతురుపాయములఁ లోఁగొనెను. వినతులను మన్నించెను.

విద్యావంతుల నాదరించెను. పన్నులను సక్రమముగా రాఁబట్టి ప్రభుసన్నిధానమునకుఁ బంపుచుండెను. దేశమునందు జక్కని కాలువలు ద్రవ్వించెను. మయూరకంఠచ్ఛాయలతోఁ బైరులు నవ్వినవి. ప్రజలు గడుపునిండఁదిని కంటినిండ నిద్రించిరి. చిదంబరమునందలి పరమశివున కనేకములగు గ్రామములఁ బెద్దన యొసఁగెను. చిదంబరేశ్వరుని గుడియందలి యొక గోపురద్వారము నల్లసానిపెద్దన గట్టించెనని నేటికిని బ్రతీతి గలదు. ఆయన సైన్యము నడుపులో నుంచుకొన గలిగెను.

ఈరీతిఁ బెద్దనదండనాయకుని ప్రాపు చిదంబర ప్రాంతముల నొక నూత్నశోభ నిచ్చినది. చిదంబరమునుండి హంపికి వచ్చు వార్తలు జాలతృప్తికరముగా నున్నవి. తిమ్మరుసు మంత్రి ప్రతిదినము నావార్తలను మహారాజునకు విన్నవించుచుండెను. పెద్దన ప్రధాన దండనాయకుఁడైనాఁడు.

పెద్దన దండనాథుఁడు హంపిని వదలినది మొదలు రాయని కొలువు "కాళిదాసులేని, భోజుని యాస్థాన"మైనది. నిరాఘాటధాటిగల కవు లనేకులుండిరి. కాని, కృష్ణరాయని హృదయమెఱిఁగిన సత్కవియేడీ ? వసంతమున నెన్నియో పక్షు లుత్సాహముగ గానమొనర్చును. కాని వసంతర్తు సార్వభౌముని హృదయమెఱిఁగి, పంచమమును బలుకున దొక్క కోకిలయే గదా ? సాహితీ సమరాంగణ సార్వభౌముఁడైనఁ గృష్ణరాయని నీచింత పీడింపఁదొడఁగినది. ఆతనిహృదయము పలుమారు'పెద్దనయేడీ ?' యని బ్రశ్నించుచుండెను. రాయలు నవ్వును కాని, యా నవ్వులయందు దొలుతటి తృప్తిలేదు. సాహితీవినోదములఁ గావించుచునే యుండెను. వానికిఁ దొలు

తటి సమగ్రత లేదు. మహామంత్రి లీమార్పు గమనించుచునే యున్నారు. పరిస్థితు లనుకూలపడినంతనే పెద్దనగారిని రాజధానికి రప్పింపవలెనని తిమ్మరుసూహించుకొనెను. చిదంబర ప్రాంతములు దిన్నఁగా సుభిక్షములైనవి. విప్లవకారులణఁగినారు. సైన్యములు సంపుష్టములుగ నుండెను. ఒకానొకనాఁడు మహామంత్రులు రాయలతో నిట్లనిరి.

"ప్రభూ! చిదంబరేశ్వరునకుఁ బెద్దనగారి సేవ పూర్తియైనది. తమ రనుగ్రహించినచో వారినిచటికిఁ బిలిపింపవచ్చును. వారి నిచ్చటనే యొక యమాత్యునిగా నియమించు దలఁపు నాకున్నయది. తమ ముదలయైనచో... ... ... ..."

కృష్ణరాయని వదనము శరత్పద్మముపోలిక వికసించెను. "అట్లే చేయుఁడు. భువనవిజయమునందలి సాహితీ వినోదములకిఁక మెఱుఁగులు వచ్చు" నని తల పంకించెను.

పెద్దనదండనాథులకు హంపికి రావలసినదని తాకీదులు వెళ్ళినవి. దుమికిళ్ళాడు దసారపు చెంగులతో, గర్ణములయందు వ్రేలాడు మణికుండలములతో, గోవజవ్యాది కదంబింపు నొడలితో, నిగ నిగని హాటక రత్న భూషణములతో, బంగరు గిలుకు పావలతో పెద్దనదండనాథుఁడు రాయల నిండోలగమున సాక్షాత్కరించెను. ఆ వాలకమునుజూచి కవులాతఁడు దండనాథుఁడని భ్రమసిరి. 'మహాకవి' యని సరదార్లు సవిగొనిరి. పరమనైపుణీరాశి యగు పెద్దన నాఁటినుండి రాయని యమాత్యులం దొకఁడు. రాచకీవి దొలుక నా మహాకవి ప్రతిదినము కొలువుకూటమున కేఁగునపుడు, విదేశరాయబారులతో సంభాషణములుసాగించునపుడు,

పరభూముల కేఁగివచ్చిన గూఢచారులతో మంతనము లాడు నపుడు, శత్రురాజులు వేయు నెత్తులకు మాఱెత్తు లల్లునపుడు నాంధ్రవాణి కొక్కొకసారి యొకచిన్నె - ఒక్కొకసారి యొకవన్నె మెఱుగారుచుండెను. బ్రహ్మక్షాత్రములు గూడు గట్టిన మూర్తి. పెద్దనామాత్యుఁడు దిమ్మరుసునకుఁ బహిః ప్రాణము. రాయలు గావించెడి ప్రతియుద్ధమునకుఁ బెద్దనామా త్యుల సలహా దప్పలేదు. యుద్ధరంగపు బ్రయాణములును మానలేదు. అరగడియు పెద్దనగారు గనబడకున్నచో, రాయలకు బ్రొద్దుగడువదు. పెద్దనామాత్యులకు రాజకీయములు మాత్రమే గాదు. రాయలతోడి సాహితీగోష్ఠియేగాదు. భువనవిజయాఖ్య మైన రాయల యాస్థానమున నాతఁడు పండిత పరీక్షాధికారి. అంతకుముందా యదృష్టము రెడ్డిరాజుల యాస్థానమునఁ గవి సార్వభౌముఁడగు శ్రీనాథునకుఁ బట్టినది. నేఁడట్టి యదృష్టము విద్యానగర సంస్థానమున పెద్దనామాత్యుల కబ్బినది. ప్రతిదిన మును దేశాంతర సమాయాతులైన విద్వద్బృందములతో వారి గృహము గిటగిట లాడుచుండెను. ఇంతమాత్రమేగాక యంతేవాసులకుఁబాఠములు సెప్పుటయు వారైవారు గల్పించి కొన్న మఱియొకపని. ఆ ఛాత్రవర్గమున కంతయుఁ బెద్దనామా త్యుల యింటనే యన్నపానాదులు. ఇన్ని పనుల తొందరతో వారి కూపిరి దిరుగుటయే లేదు.

హంపిచేరిన తరువాత పెద్దనామాత్యుఁడు వైష్ణవమును స్వీకరించెను. కృష్ణరాయలు మహాకవికి గోకట మను నగ్ర హార మొసఁగియుండెను. పెద్దనామాత్యులు దానిని శ్రీవైష్ణ వుల కగ్రహారముగా నిచ్చిరి. దానికపుడు 'శఠగోప పుర' మని నామాంతరము గావింపఁబడెను. 'శఠగోపయతి' పెద్దనా

మాత్యునకు వైష్ణవము ననుగ్రహించిన గురువరేణ్యులు. అందుచేఁ దనగురునిపేరిఁట పెద్దనామాత్యుఁడా దానము నొసఁగినాఁడు. కృష్ణరాయలుగూడ మహాకవి ప్రబోధమున వైష్ణవమును స్వీకరించెను. మూరురాయరగండఁడు వైష్ణవ సిద్ధాంత ప్రతిపాదకమగు 'ఆముక్తమాల్యద' యను గ్రంథమునుగూడ రచించినాఁడు.

రాయలప్పుడు పెద్దనామాత్యులను మహాకావ్య నిర్మాణమునకైఁ బ్రేరేపింపఁ దొడఁగెను. ఆకావ్యమును దానుగృతి నందవలెనని రాయల యిచ్ఛ. పెద్దన దొలుతఁ బలుకలేదు. రాయలు తొందరించుట మానలేదు. జాంబూనదాంబరాగ్రహారములతోడి వీడ్యముగూడ నొసఁగెను. మహాకావ్యరచన తనవలన సాధ్యముగాదని పెద్దన మొగమోటముమాని విదలించి వేసినాఁడు. అవును కావ్యనిర్మాణమన్న సామాన్యమైన పనియా? తన కావ్యరచనమునకు సాధనములుగా నిరుపహతిస్థలము గావలెనఁట. రమణీప్రియ దూతిక తెచ్చియిచ్చు గప్పురవిడెము కావలెనఁట. ఆత్మకింపయిన భోజనము, నూయెల మంచము, నొప్పఁ దప్పరయు రసజ్ఞులత్యావశ్యకమఁట. ఊహ దెలియఁగల లేఖక పాఠకోత్తములు లేనిది బనియే సాగదు.

ఈ సమాధాన మెంతసరసముగా నున్నది! ఈచీవాట్లకు రాజు లోలోన నవ్వికొన్నాఁడఁట. అట్టి విద్వత్ప్రభువులుండిరి గనుకనే పెద్దనబోలు రసికకవు లానాఁడు వెలసిరి.

పెద్దనామాత్యులకుఁ బట్టిన యీ యదృష్టము కొందఱి కవుల కసహన కారణమైనది. పైకి వారేమియు ననలేరు. లోని యసూయ నణఁపలేరు. పెద్దనగారిఆధిక్యము నెట్లులైనను

తగ్గించుటకు వారు బ్రయత్నించుచునే యుండిరి. ప్రయత్నించు కొలఁదియు పెద్దనప్రతిభకు వికాసాతిశయమే యబ్బు చుండెను.

ఒకనాఁడు రాయలు విద్యాగోష్ఠిలో నుండెను. ఆనాఁడు రత్నములు జెక్కిన గండపెండేర మొకటి విద్యానగరాధిపతి సభకుఁదెచ్చెను. ఆమణీనిచయముల పలువన్నెలు గొలువునందు నెమలి పురుల కాంతులను వెదఁజల్లినవి. రాయని కాలమునందును, నంతకుమునుపును, గండపెండెరములు రాజులు మాత్రమే ధరించువారు. ఒడ్డెరాజులు, కాకతీయ ప్రభువులు, రెడ్డిరాజులు, విద్యానగరాధిపతులు, గండపెండెరములు ధరించుట వాడుక. శాత్రవులెవ్వరైనను దమ కోడిపోయినపుడా రాజు లోడినవారి దలలను దమ పెండెరములందుఁ జెక్కించుకొను చుండిరి. అది వీరమర్యాద. రాయలు నేఁడా మరియాదను గవిరాజులకుఁ గూడ సంక్రమింపఁ జేయఁదలఁచెను. సాహితీ సమరాంగణ సార్వభౌముఁడు గొలువుఁ గలయఁ బరికించి "చక్కని కవిత చెప్పఁ గలవారి కీ పెండెరముఁ దొడిగెద" నని పలికెను. పెద్దనామాత్యు లాకొలువునందుండిరి. రాయని పలుకులకుఁ గవులెల్లరును గిమ్మనలేదు. కొలువెల్ల విత్తాకైనది. పెద్దనామాత్యులుకూడ నాఁ డేలొకో 'నేనుజెప్పెదు' నని లేవలేదు. కృష్ణరాయని కనుత్సాహమైనది. అతఁడు నేఁడీ కొలువు జిన్నవోయినదేమి? ముద్దుగ గండపెండియరముఁ గొనుఁడని బహూకరింపఁ దలఁచితిని. ఒద్దికఁగ నా కొసఁగుమని యొక్కరును లేవకపోవుట కేమికారణమని విసిగికొన్నాఁడు. ఈ విసుగు దక్కిన కవులెవ్వరికిని గలచినదో లేదో! పెద్దన మన

సునకు మాత్రము జింతకాయ కొఱికినటు లైనది. ఇంతటి సభలో, గండపెండెరమును ధరింపఁగలకవి యొక్కఁడైనను లేఁడా! పెద్దనమహాకవి వెంటనే యున్నతాసనమునుండి లేచి యిట్లు పలికెను.

"రాజశిఖామణీ! నీవు విజ్ఞుఁడవు. పెద్దనామాత్యుని బోలు పండితుఁడు పృథ్వియందు లేఁడని నీ వెఱుఁగవా? పెద్దనకీయ మనసున్నచో నాకిడుము."

కవులు దమకుఁ దెలియకనే కరతాళముల నొనర్చిరి. పెద్దన యాకరతాళధ్వనులలోననే యందికొనియనర్గళధారావేగ ముతో సుమారేఁబదిపాదములుగల యుత్పలమాలికను సభపైకి వెదజల్లెను. ఆ యాశుధారతోఁ గొలువంతయు నుత్పల ములు విదల్చినటులైనది. మల్లెలు జలజలరాల్చినటులైనది. మదబంధురములగు గండుకోయిలల బంచమస్వరములు, భ్రమరీఝుంకారములు, వాగ్దేవి మిసమిసని కడగంటిచూపులు ఆసమయమున నాకొలువునందెల్లెడ నిండినవి. రాయలాశ్చర్య పులకితుఁడైనాఁడు. సభ్యు లమందానంద భరితులైరి. అప్పాజీ చల్లగా నవ్వుచుండెను. గిరిశృంగమును విడిచివచ్చు సింగము వలె రత్నఖచిత సింహాసనమునుండి రాయలు దిగివచ్చెను. ఆ రాజుచేతియందు రత్నఖచితపెండెరము మెఱయుచుండెను. మహాకవిపాదమును, స్వయముగఁ దనకరములచేఁ బట్టి రాజు పెండెరమును దొడిగెను. ఆపాండిత్యవీరునకు నాఁడు దివౌకసులే జోహారులు బాడినటులున్న దా దృశ్యవైభవము.

తరువాత పెద్దనామాత్యులు, గ్రంథరచనమున కుపక్ర మింపలేదు. రాయలుమాత్రము మాటిమాటికిని హెచ్చరించు చునే యుండెను.

రామరాజభూషణుడు వసుచరిత్రమును వ్రాసిన మహాకవి. రామరాజభూషణుడనున దాతని బిరుదనామము. వాని తొలుతటిపేరు భట్టుమూర్తి. అతఁడు జదివినది పెద్దనామాత్యులచెంతనే. భట్టుమూర్తికిఁ బాండిత్యగర్వ మెక్కువగా నుండెను. ఆ గర్వము గురుధిక్కారమునకు సైతము వానిని బ్రేరేచెను. ఒకనాఁడు వాకిట కావలి తిమ్మని యింటియెదుటి దిన్నెయందుఁ బెద్దనమొదలైన మహాకవులందఱు సరస సంభాషణమొనర్చుకొనుచుండిరి. వాకిట కావలితిమ్మఁడుహంపి లోని యొక గవనికి ద్వారపాలకుఁడు. అనగా వాని యధికార మప్పుడు సామాన్యమైనదిగాదు. రాజుగారియొద్ద నదియొక సామంత రాజులతో సమానమైన కొలువన్నమాట. నగర రక్షణకార్య భారమంతయు వానికి లోఁబడినదే. వాకిట కావలి తిమ్మఁడు గొప్పసాహిత్యాభిలాషి. చక్కని పండితుఁడు గూడ. అందుచే రాయలనాఁటికవులందఱుఁ దఱికసమయములం దచటఁ జేరెడివారు. ఆనాఁటి సాయంకాలముగూడ వాడుక ప్రకారము జేరి సాహిత్యవిషయములఁ జర్చించుకొనుచుండిరి. అప్పుడు మాధవుఁడను దనశిష్యుని వెంటఁబెట్టుకొని భట్టుమూర్తి యా దారిని వెళ్ళుచు, వాని నిట్లు ప్రశ్నించెను. "మాధవా! వాకిట కావలితిమ్మని వాకిటయందున్నయది కవికోటియగునా ? లేక వరాహములగుంపా" యని యర్థము నిచ్చు పద్యపాదములను జదివి తనశిష్యుఁడైన మాధవుఁడా కవికోటికి కిటికోటియే యని గురువుగారిని సమర్థించుచుఁ బద్యముఁ బూరించునని భట్టుమూర్తి గంపెడాశతోనుండెను.

కావలితిమ్మని యింటియెదుటఁ గూరుచున్న కవులందఱీపద్యపాదములను వినిరి; కాని మిన్నకుండిరి. భట్టుమూర్తి

యల్లసాని పెద్దనకు శిష్యుఁడని వారెఱుఁగుదురు; గురుశిష్యులకు గల మనస్పర్థలను వారెఱుఁగుదురు. పెద్దనామాత్యుల కీ ఘట్ట మసహ్యమైనది. ఆయన వెంటనే,

"ప్రాకృతము, సంస్కృతము, ఘూర్జరము మొదలైన భాషలయందుఁ జక్కఁగాఁ బరిశ్రమింపక మూఁగలైనట్టి యల్ప కవులనెడి దుంగముస్తెలకు వాకిటకావలి తిమ్మని వాకిటి గూర్చున్న కవికోటి కిటికోటియే" యని బదులిచ్చినాఁడు. వరాహములు దుంగముస్తెలను దినునుగదా! అల్లసాని పెద్దనామాత్యుల దృష్టిలో ప్రాకృతాది భాషలయందుఁ జక్కఁగాఁ బరిశ్రమింపని భట్టుమూర్తి దుంగముస్తె; తాను వరాహము. ఈ యుత్తరముతో భట్టుమూర్తికి శృంగభంగమైనది. తల వంచికొని వెడలిపోయినాఁడు.

ఇంతలో గజపతులతోడి యుద్ధము మొదలైనది. రాయని విద్యానగరసైన్యములు గెలిచినవి. గజపతిని రాయలు వింధ్యారణ్యములలోనికిఁ దరిమెను. ఆంధ్రరాజ్యము సుభిక్ష మైనది. పెద్దనామాత్యులు మహాకావ్య రచనకై యోచించు చున్నారు. అంతకుముందే పురాణముల దెనిగింపు ఆంధ్రమునకుఁ బరిపాటియైనది. తాను మరల నదేత్రోవ ద్రొక్కినచోఁ దన ప్రత్యేకత యేమి! ఒక నూత్నపంథనే యెన్నికొనవలెను. అయ్యది ధ్వనిమార్గమున దన కాలమును బ్రతిబింబింపఁ జేయువలయును. కృష్ణరాయని కాలము దాక్షిణాత్యమున కొక స్వర్ణ స్వప్నము వంటిది. మహమ్మదీయుల లాలసత, భారతీయుల ధర్మదృష్టి, నాఁటిజనుల జీవితములం దొదిగిపోయి నది. శిల్పములో, గవితలో, గానమునందు, నాట్యవిద్యలో

ముస్లిముల మర్యాద లాక్రమించినవి. హైందవజాతి యెన్నఁ డును సౌందర్యప్రేమకు సంకుచితదృష్టిని ముడివెట్టదు. మహ మ్మదీయ శిల్పముల ననుసరించి జిత్రింపఁబడిన దర్వాజాలు దాక్షిణాత్యశిల్పమునం దొక క్రొత్త యుగమునే స్థాపించినవి. ఈ మార్పులన్నియుఁ దన కావ్యమున బ్రతిఫలింపఁ జేయవలె ననుకొన్నాఁడు పెద్దన. అట్టి కథయేది? వాఙ్మయమును దిరుగ వేసినాఁడు. వరూధినియను నచ్చరవాలుఁతుక పెద్దనామాత్యుని భావదృష్టి నాకర్షించినది. ప్రవరుని ధర్మజీవన మా మహాకవికి గౌరవపాత్రమైనది. కావ్యరచనము నారంభించినాఁడు. ఆ కావ్యమున మఱియొక విద్యానగరమునే సాహిత్యలోకమున గట్టినాఁడు. ఆ జీవనమింక దెలుఁగువారికి లేదు. అట్టి కావ్యము మఱియొకటి గానరాదు.

ఆ సమయమునఁ బ్రభువునుద్దేశించి పెద్దనామాత్యుఁడు తన కావ్యము పూర్తియైనదని విన్నవించుకొనెను. రా జానం దమునొంది 'ఏమికావ్య?' మని ప్రశ్నించెను. అపుడు పెద్దనా మాత్యుఁడిట్లు పలికెను. "మహారాజా! దానికి మనుచరిత్రమని పేరిడితిని. అనఁగా స్వారోచిషమనువుయొక్క జన్మవృత్తాంతము. దేవరయే దాని నవధరింప నర్హులు."

కొలువునందుఁ గావ్యపఠన మేర్పాటు జేయఁబడినది. సామంతులు, దండనాయకులు, సరదారులు బంతులుదీరి కూర్చొనియుండిరి. గాయకులు, కవులు, భరతశాస్త్రజ్ఞులు, మహావిద్వాంసు లొకయెడ నున్నతాసనములపై నుండిరి. పరిచారికా సహస్రముఖము లాకొలువు సరస్సునఁ దామరల వలె నటనటఁ గనుపించుచుండెను. వందిమాగధుల జయజయా

కారములకు గగనము ప్రతిధ్వనించుచుండెను. పెద్దనమహాకవి యింకను సభకురాలేదు. రెండు మూఁడాహ్వానములు గావింపఁబడినవి. వారప్పటికిని రాలేదు. అప్పుడు కవిహృదయమును రాయలు గమనించెను.

అప్పాజి దనవెంటరా నొకపల్లకిఁగైకొని, మహాకవి గృహమునకుఁ గాలినడకను వెళ్ళెను. రాయలు వెళ్ళునరికి వారొక యున్నతాసనముపై నుండిరి. కృష్ణరాయని ముఖమును బరికించి మహాకవి చిఱునవ్వు నవ్వెను. అప్పుడప్పాజీయిట్లనియె. "దేశసామ్రాజ్యమునకు రాయలధికారులు. కవితాసామ్రాజ్యమునకు పెద్దనగారు బట్టాభిషిక్తులు. కనుక గవితావిషయములందుఁ బెద్దనగారికిఁ జక్రవర్తివైభవము లన్నియు జరుగవలసినవే."

'నిజము - నిజ' మనుచు రాయలు సంతోషభరితముగఁ దలపంకించెను.

'విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్' అని సవిలాస గర్వముగఁ బెద్దన యనెను.

పెద్దనమహాకవి గ్రంథము బల్లకియం దుంపఁబడినది. ఆ పల్లకియంతయుఁ బూలమాలికలతో నలంకరింపఁబడినది. పెద్దనామాత్యుల నొక యంబారీపై నెక్కించిరి. పుస్తకము నుంచిన పల్లకి నొకవైపు రాజు పట్టినాఁడు. మఱియొకవైపు అప్పాజి దన్నుఁగా హస్తాలంబనమిచ్చెను. కొలువుకూటము వఱకు వారటులే మోచికొని వచ్చిరి. ఆనాఁటి యావైభవమును జూడ విద్యానగర ప్రజలు దమరెండుకన్నులు జాలవని తల్లడిల్లిరి. రత్నఖచితమగు నొక యున్నతవేదిపైఁ బఱచిన రత్నకంబళి - దానికంతయు బంగారుజరీ యున్నది. ఆ రత్న

కంబళిపై పుష్పములొత్తుగఁ బరువఁబడియున్నవి. గోవజవ్వాది, పన్నీరు, గస్తూరి యాపుష్పములపై జిలుకరింపఁబడినవి. ఆ పూవులమధ్య ఆ మనోహరసువాసనా ప్రపంచమున మహాకవు లాసీనులైరి. ఆ వేదిక వెనుక తెరలపై హిమాలయ మనోహర సన్నివేశములు జిత్రింపఁబడి యుండెను. నాలుగైదురోజులుఁ గ్రమముగఁ గావ్యపఠనము సాఁగినది. ఆ నాలుగు రోజులు విద్యానగర ప్రజలు, పెద్దనామాత్యుని కావ్యరసమునే యాస్వాదించిరి. తుంగభద్రాస్రవంతియం దాదినములలోఁ గేవల జలములుగాక, మహాకవి సృష్టించిన కాయమానజటిల ద్రాక్షాగుళుచ్ఛరసములే ప్రవహించెను. తన సామ్రాజ్యమంత యును మహాకవికి ధారాదత్తమొనర్తమనునంతటి యుత్సాహము సాహసము గృష్ణరాయని మనసున నగ్గలించెను.

ఇఁక మహాకవికి సన్మానముల కేమియలఁతి? వేలకోలఁది చీనాంబరములు గప్పిరి. అగ్రహారము లొసంగఁబడెను. జయ జయ ధ్వానములమధ్య 'నాంధ్రకవితాపితామహుఁ' డన్న సార్థకబిరుద మీయఁబడినది. పెద్దనను మూర్తీభవించిన నన్నయ యని కొందఱును, శ్రీనాథుఁడని కొందఱును, నాచన సోమనాథుఁడని మఱికొందఱును బ్రశంసించిరి. ఎవరెవ రేరీతి బ్రశంసించినను సాహిత్యమునఁ బెద్దన పెద్దనగనే నిల్చెను. తరువాతి కవుల కెల్ల నాతఁ డొరవడియైనాఁడు. కావ్యపఠనము బూర్తియైన తరువాత రాయల కృతిస్వీకరణము జరిగెను. కృష్ణరాయని కానాఁడు పెండ్లికొడుకువంటి యుత్సాహము కలిగెను. మనుచరిత్రను కృతినందుటచే విద్యానగరనాథుని జీవితము ధన్యమైనది. రాయలవంటి రసికుఁడు వరించుటచే నా కావ్యకన్య జీవితమును సార్థకమయ్యెను. నాఁటినుండి

పెద్దనామాత్యుఁ డెచట నెదురుపడినను దాను గూర్చుండిన యేనుఁగును రాయలు నిలిపి యా మహాకవికి కేలందించి యంబారీపై నెక్కించుకొని పోవుచుండెడివాఁడు.

అల్లసాని పెద్దన యనేక విద్వత్కవులకు రాయలతో సన్మానములు గావింపఁజేసెను. పెద్దన యనుగ్రహముననే రాధామాధవకవి పేరునకు వచ్చినవాఁడు.

కాలపురుషుఁడు దేశచరిత్రమునఁ బుటఁ దిరుగవేసెను. మొదట నప్పాజియుఁ దరువాత రాయలును కాలగతిఁ జెందిరి. కృష్ణరాయలు బ్రతికియుండినంతవఱకు నఖండవైభవము లందిన యాంధ్రసాహిత్యలక్ష్మి, పాపము చిన్నవోయినది. రాయలు లోకాంతరగతుఁడైనంతనే కటకమునుండి గజపతి విద్యానగరముపై దండెత్తివచ్చెను. దేశభక్తి ప్రపూరితుండగు పెద్దనామాత్యున కీ సంఘటనము సమ్మెటపెట్టయినది. యుద్ధమున కాయత్త మగుటకు సరియైన సైన్యమూ లేదు. రాజ్యమునకు సరియైనపాలకులూ లేరు. కృష్ణరాయని సంతానముకూడ గతించిపోయెను. సామంతులందఱు సింహాసన మాక్రమించుకొనుటకై బరస్పరమెత్తులు వేసికొనుచుండిరి.

వారిలో నొక్కొక్కరికి 'సింహాసనము దమకు దక్కకున్నచో నన్యాక్రాంతమగుటయే మేల'ను నంతవఱకు దుర్భావముప్పతిల్లినది. పెద్దనామాత్యునకు, గతవైభవములు స్మరించినంతన, గన్నుల నీరుదిరిగినవి. కుపిత హృదయముతో గజపతిపై మహాకవి తన వాక్శరమును బ్రయోగించినాఁడు. ఒక సేవకముఖమున, పెద్దనామాత్యునిచే గజపతిదగ్గఱ క్రిందియర్థముగల పద్యము పంపఁబడినది.

"ఓగజపతీంద్రా! రాయరాతు గండ రాచవసుఁగువచ్చి యారట్లకోటఁ గోరాడునాఁడు నీ వెచటనుంటివి ? నాఁడొాడ లెఱుఁగవా ? సంపెట నరపాల సార్వభౌముఁడు సింహాచలమున జయ స్తంభమును నిలుపునెడ నీవు జచ్చి యుంటివా ? సెలగోలు సింగమైన వేంకటపతి జేరి నీ కోటయందలి గంచుతల్పులకు గరుల డీకొల్పునపుడు నీవుర్విపైన లేవా ? ఘనతర నిర్భరమైన గండపెండెరము నిచ్చి, నీకూఁతు రాయని కొసఁగునాఁడు నీ విక్రమ మేమయ్యెను ? నేఁడు రాయలు మరణించినంతనే దెఱచినయింటిని గుక్క ప్రవేశించునట్లు గన్నడరాజ్యమునఁ బ్రవేశించు చుంటివా !" ఆ పద్యమును విన్నంతనే గజపతి సిగ్గుపడి మఱలిపోయినట్లు వచింతురు. పై సందేశమునందలి సంపెట నరపాలుఁడు గృష్ణరాయఁడే. వారివంశము తుళువవంశము. ఇంటిపేరు 'సంపెట' వారు. నేఁటికిని సంపెటవా రనంతపురమండలమునం దున్నారు.

## ఉ ప సం హా ర ము

'ఖిలము గాకుండునది ధాత్రి కృతియొ' యని నుడివిన కృష్ణదేవరాయని సరసోక్తి కనుగుణముగ 'అల్లసాని పెద్దన కవీంద్రుఁడు' స్వారోచిష మనుచరిత్రమను నొక మహాప్రబంధ మును రచించి తనకీర్తియు గృష్ణరాయని యశమును జిరస్థా యిగ నొనర్చి ధన్యుఁడైనాఁడు.

---

# పాలకురికి సోమనాథుఁడు

వీరశైవమును స్థాపించిన యతఁడు బసవేశ్వరుఁడు. బసవని యావిర్భూతికి ముందే శైవసిద్ధాంతము గలదందురు. కావచ్చును. కాని బసవన్న యా శైవమును వీరుఁడై యుపాసించెను. నాటినుండి యామతము 'వీరశైవ'మైనది. అతఁడు జన్మమునుబట్టి బ్రాహ్మణుఁడు. కాని శైవమును స్వీకరించి కులములను గర్హించినాఁడు. బసవఁడు నందీశ్వరుని యవతారమని వీరశైవుల విశ్వాసము. అతనితల్లి మాదాంబ, తండ్రి మండెగ మాదిరాజు. మండెగ మాదిరాజు శివార్చనాపరుఁడు. ఆ శివార్చనమునకు మెచ్చి నందీశ్వరుఁ డాతని గర్భమున జన్మింతునని సెలవొసఁగెను. ఆ నందీశ్వరుఁడే బసవఁడుగా నవతారమెత్తినాఁడు. బసవేశ్వరుని జన్మస్థానము శ్రీశైలమునకుఁ బశ్చిమభాగమునఁ గర్ణాటదేశమునం దున్నది. దాని పేరు హింగుళేశ్వర భాగవాటి. అది యొక యగ్రహారము. ఎనిమిదవయేట బసవేశ్వరుని తండ్రి మండెగ మాదిరాజు బసవన్న కుపనయనము సేయదలఁచినాఁడు. కుమారుఁ డద్దాని గర్హించెను. బసవన్న 'కల్యాణకటకము' నేలిన బిజ్జలునిదగ్గఱ దండనాయకపదవి నంగీకరించెను. బిజ్జలుఁడు గలచుర్యవంశమువాఁడు. జైనుఁడు. కాలక్రమమున బిజ్జలునకును బసవన్నకును నడుమ వైరుధ్యములు దల సూపినవి. బసవఁడు భక్తులైన జంగములకు బండరు నంతయుఁ బంచియిచ్చుచుండెను. అది బిజ్జలునకు గిట్టలేదు. కల్యాణకటకమునందు మిండజంగములు ఖడ్గపాణులై దిరుగుచుండిరి. వారి నెవ్వరు బల్లెత్తుమాట యనరాదు. అన్నచో

మహామంత్రియైన బసవఁడు జిచ్చఱకంటఁ జూచుచుండెను. ఈ పద్ధతితో బ్రజలయందు ధర్మము గుంటువడినటు లుండెను. రాఁగ రాఁగ బిజ్జలునకు మహామాత్యుల చేఁత లసహ్యమైనవి. కోపముగొన్న బిజ్జలుఁ డిరువురు వీరమాహేశ్వరులకుఁ గన్నులు బెఱికించెను. దానితో బసవఁడు క్రుద్ధుఁడైనాఁడు. 'కల్యాణకటకము బొడయిపోవు' నన్న శాపాక్షరము లా పెదవులనుండి జారినవి.

వీరమాహేశ్వరుల కపచారముగావించిన కటకమునఁ దానుండనని బసవఁడు బయలువెడలి కర్ణాటకమున లింగైక్యమందినాఁడు. బసవని యనుయాయులగు జగదేవాదులు బిజ్జలుని బొడిచిచంపిరి. బసవేశ్వరుఁడు వీరశైవ మతవ్యాప్తికై మహమ్మదువలెనే బ్రత్యక్షముగ గత్తిఁగట్టెను. శివభక్తుల దుశ్చరిత్రములు మేలుగనే గ్రహించెను. శత్రువులైనను లింగవంతులను మిత్రులుగానే జూచెను. ప్రాణాపాయస్థితులనైనను బట్టినవ్రత మాతఁడు విడువలేదు. శివద్వేషులను జంపించెను. మహోద్ధరుఁడై శివపారమ్యమును దిక్కుదిక్కులఁ జాటెను. బసవన్న జూపించిన మాహాత్మ్యము లసంఖ్యాకములు. శివపారమ్యమును స్థాపించుట కాతఁడు విసమెత్తిగ్రోలెను. జొన్నలరాశిని ముత్యములరాశిగా మార్చెను. తన్నుఁ బరీక్షింప వచ్చిన కూడలిసంగమేశ్వరుని పరీక్ష కాగి తనచెలువఁ గట్టిన వలువనూడ్చియిచ్చెను. ఇట్టిఘట్టములు గుప్పలు తెప్పలు బసవని జీవితమునఁ జూపవచ్చును. కన్నడభాషయం దీమహాకవి పరమశివునిపై లాలితంబుగ నాల్గులక్షలమీద నోలి నిర్వది నాల్గువేల గీతములు పాడెనఁట !! మత చరిత్రయందు బసవేశ్వరుఁ డొక మఱపునకురానివ్యక్తి. బసవనినాటనుండి.

వీరశైవ మహోఘముగ దేశమున వ్యాప్తిఁగాంచినది. పాలకురికి సోమనాథుఁడు గూడ వీరశైవుఁడే.

సోమనాథునిఁ గడుపారఁగన్నతల్లి శ్రియాదేవి. తండ్రి విష్ణురామిదేవుఁడు. సోమనాథుని జన్మస్థానమేది ? యను విషయమున ననేక వాదములున్నవి. వానిలోఁ బ్రబలమైన దోరుగంటివాదము. ఓరుగంటికి సమీపమున బాలకురికి యను నొక గ్రామము గలదు. అదియే సోమనాథుని జన్మస్థానమని వారు వాదింతురు. సోమనాథుఁడు ప్రతాపరుద్రుని కాలముననోరుగంటి యందుఁ బండితులలో వాదించి జయించెననియు, నాతని జన్మస్థాన మోరుగంటికి సమీపమునఁ గాకున్నచోఁ గాకతీయుల ముఖ్యపట్టణమందు వివాదములు జరుగుట సంభవింపదనియు వారివాదము.

ఈ వాద మెంత విచిత్రము! సోమనాథుఁడు వేరు చోటఁ బుట్టియున్నంతమాత్రమునఁ బండిత వివాదముల కోరుగంటికి వెళ్ళి యుండఁగూడదా ? సోమనాథునికి ముందు వీరశైవమతవ్యాప్తి యంతయుఁ గర్ణాటకముననే యెక్కువ జరిగినది. కనుక వీరశైవమును సమగ్రముగ సోమనాథుఁడు జీర్ణించికొని యుండవలెనన్న నాతఁడు గన్నడమును బాగుగాఁ జదివియుండవలె. అసలు సోమనాథుఁడే వ్రాసిన కావ్యములు గన్నడమున నున్నవి. ఆంధ్ర కర్ణాటకముల గూడలిపట్టిలోఁ 'బాలకురికి' యను గ్రామము గలదు. అనంతపుర మండలము నందలి హిందూపురమునకు సమీపమున నాయూరున్నది. సోమనాథుఁడు లింగైక్యమందిన 'కలికెము' అను గ్రామము గూడ నక్కడికి సమీపమే. అందుచేఁ బాలకురితిని బాలకురికి

యని దలమార్చుట కంటెను నాపేరితో నేఁటికిని వెలయు గ్రామమునే సోమనాథుని జన్మస్థానమని నిర్ణయించు టన్యాయముగాదుగదా! 4/9

హిందూపురము దగ్గర బాలకురికియే సోమనాథుని జన్మస్థానమైనచో నోరుగంటి కాతఁడు వెళ్ళుట యెట్లు దటస్థపడునని యోరుగంటివాదు లందురేమో! పూర్వకాలమున దూరప్రయాణములు సాగెడివేగదా యేమి? అట్లే యైనచో నెక్కడో కొండవీటి యందున్న శ్రీనాథుఁడు ప్రౌఢదేవరాయల యాస్థానమునఁ గనకాభిషేక మెట్లుఁ గాంచగలిగెను? రాయలు దంజాపూరునందు సామంతుల నెట్లుంచగలిగెను? గజపతిని వింధ్యారణ్యముల కెట్లు దఱుమఁగలిగెను? సింహాచలమున విజయస్తంభ మెటులు నాటఁగలిగెను? పూర్వకాలమునను దూరప్రయాణముల కనువైన పద్ధతులుండెడివి. వారు గుఱ్ఱములపై నెక్కి 'యంచె' ల యేర్పాటులతో దూరప్రయాణములఁ గావించెడివారు. 'అంచె' యనఁగా సామాన్యముగఁ బదిమైళ్ళదూరముండును. ఆ యంచెలయందు, ధర్మసత్రములుండెడివి. గుఱ్ఱములకు గడ్డి గాదముల కేర్పాటు లుచితముగ లభించుచుండెను. ప్రయాణికు లక్కడఁ దమ బ్రాఁతగుఱ్ఱముల వదలి క్రొత్తహాయములఁ దీసికొని మఱియొక యంచెవఱకుఁ బోయెడివారు. ఈ వ్యయమంతయు నాయాప్రాంతముల పాలకులే భరించుచుండిరి. యుద్ధసమయములందుఁ గూడఁ బాలకు లీ నియమములఁ బాలించుచునే యుండెడివారు. తెనుఁగునం దంచెలు గొట్టువాఁడా! యను నొక తిట్టుగలదు. అనఁగా నట్టివాఁడు చాల క్రూరుఁడన్నమాట!

ఆనాటిదారులుగూడ నీనాటి 'రోడ్డుల' వలెఁ జుట్టు చుట్టియుండెడివిగావు. వారిమార్గములు గొండలలోఁ గనుమల గుండ బోయెడివి. నేఁడు మనము జూచుచున్న మార్గములు ఆంగ్లేయప్రభువులచే నిర్మింపఁబడినవి. వారికిఁ బ్రజలసౌకర్యము గాదు ముఖ్యముగ దృష్టిలోనుండినది – వారి పదాతిసైన్యములు నడచివెళ్ళుటకు సౌకర్యముగా నుండవలెను. సైన్యసామగ్రి వెళ్ళుట కనుకూలముగ నుండవలెను. మోటారులు, లారీలు వెళ్ళవలెను. అవి కనుమలగుండా వెళ్ళలేవుగదా! ఇంతేగాదు. సైన్యములు దారిపై బ్రయాణించునపుడు నడుమనడుమ ననేకములు బల్లెలును దగులుచుండవలెను. ఆ జనులు సైన్యములను జూచి భయపడుచుండవలెనఁట! ఈదృష్టితో నేయఁబడిన మార్గములలోఁ బ్రజాసౌకర్య మెటనుండి వచ్చును? ఆనాఁడు 'గుత్తినుండి' 'హంపికి' కొన్నిగంటల ప్రయాణముఁట.

నేఁడు పొగబండిలోఁగూడ సుమా రొక మధ్యాహ్న ప్రయాణము. పెనుగొండనుండి హంపికి నాఁడొక మధ్యాహ్న ప్రయాణమఁట! నేఁడొక దనప్రయాణము. అది యట్లుండె! సోమనాథుఁడు భృంగియవతారమని వీరశైవులు విశ్వసింతురు. వైష్ణవమునకు రామానుజుల యనంతరము వేదాంత దేశికు లెట్లో వీరశైవమునకు బసవనిదర్వాత సోమనాథుఁడట్టివాఁడన వచ్చును. ఈ సోమనాథుఁడు జంగముఁడని యొకవాదమున్నది కాని యాతఁడు, జన్మచేత బ్రాహ్మణుఁడే. తన మేనమఱఁదిని గురించి యొకచోట సోమనాథుఁడు 'యాపస్తంబసూత్ర! హారితసగోత్ర! విద్యాపుణ్యాగాత్ర!' యని సంబోధించినాఁడు. తాను బ్రాహ్మణుఁడు గాకున్నచోఁ దన మేనమఱఁది హారితస గోత్రుఁడు, నాపస్తంబసూత్రుఁడగుట సంభవింపనేరదుగదా!

సోమనాథుఁడు జన్మించిన యనంతరము వైదికవిధి ననుసరించి తండ్రి యుపనయన సన్నాహములు గావించెను.

సోమనాథున కది చెవిసోకినది. వీరమాహేశ్వరున కుపనయనమే! శివస్వరూపుఁడగు శైవుఁడు జన్మముతోడన పవిత్రుఁడు. వానికి మఱల ద్విజత్వప్రాప్తికై యుపనయన మనవసరము. ఈ వాద మానాటి బ్రాహ్మణులకు నాశ్చర్యమునే గలిగించినది. వారు దమకుఁ దెలిసిన వైదికవాక్యము లెత్తి చూపిరి. వానిని సోమనాథుఁడు ముక్కలుగఁ గొట్టినాఁడు. పెట్టక పుట్టిన సహజభూషలటులు - జడువక యె వచ్చిన యా సోమనాథుని వైదుష్యము మహోజ్జ్వలమై బ్రకాశించినది. లిపిలిఖింపకమున్న యపరిమితార్థోక్తి సోమనాథుని జిహ్వాపైఁ బరగెను. ఛందోవ్యాకరణాదసరణి జూడకమున్న గావ్యనిర్మాణ శక్తి యాతనికబ్బినది. భాష్యసంగతు లెవ్వరును సోమనాథునకు వివరింపలేదు. అతఁడప్పటికిఁ జూడనేలేదు. కాని రుద్రభాష్య క్రియారూఢి వెలసినదఁట! తర్కశాస్త్రాది విద్యలు వరింపకమున్న బరపక్ష నిగ్రహప్రౌఢి వానికిఁ జేకూరినది. అతని నెదిరింప పండితుల కెట్లు శక్యమగును? కొంద ఱుపనయనము జరుపకున్నచో నీదేగోత్రమని జెప్పికొందువని సోమనాథుని బ్రశ్నించినారు. సంశయింపక సోమనాథుఁడు 'బసవనిగోత్ర' మని పలికెను. వారి కింకేమియుఁ దోచినదిగాదు. అనుష్ఠానశూరతలేని ప్రతివాదులను జూచి సోమనాథుఁడు 'ద్రాటిమాల' లనియు 'బచ్చిమాల' లనియు నవహేళన మొనరించినాఁడు. సోమనాథుఁడు గాయత్రీమంత్రమునకు శివపరముగ నర్థము సెప్పి ప్రతివాదులనోరు మూయించెను. గాయత్రి యనుష్ఠేయమేమైనను బంచాక్షరి భక్తునిప్రాణమని యాతఁడు వాదించి

నాఁడు. నాటినుండియుఁ దల్లిదండ్రులబేరుఁగూడ సోమన్న దడవమానెను. తాను 'బసవనిపుత్త్రుఁడ' ననియు 'బసవని గోత్రుఁడ'ననియు బాహాటముగఁ బ్రకటించుచుండెను. కులమువా రాతని బహిష్కరించిరి. పరమభక్తునకీ బహిష్కారము లేమిసేయును? సోమనాథుఁడు దనశైవదీక్షను విడువనేలేదు. ఆకాలమున వీరశైవభక్తు లింక ననేకులుండిరి. చెన్నరాముఁ డను వీరశైవుఁడు సోమనాథునకుఁ బ్రాణసఖుఁడు. కరస్థలి సోమనాథయ్య శ్రీశైలమునకు గవనియైన త్రిపురాంతకమం దుండెను. అతఁడే సోమనాథునకుఁ గవితాగురువు. రెంటాల మల్లినాథుఁడు మఱియొక వీరశైవుఁడు. ఇతనికి సమాలంఘన వ్రతముండెను.

అనఁగాఁ 'బొలిమేరనుదాఁటిపోఁగూడ'దను నియమము. ఈవ్రతము నాభక్తుఁ డాజన్మాంతముఁ బాలించెను. శ్రీశైల మునఁ గుమారాచలమునకు మెట్లుగట్టించి – మరణించువఱ కచ్చటనే నివసించెను. దోచమాంబ వేరొక భక్తురాలు. ప్రతివాసర మైదు గరవీరపుష్పములచేఁ బరమశివు నర్చించుట యామె వ్రతము. ఒకనాఁడొక పుష్పము దక్కువైనదఁట! వెంటనే యామె తనకంటిఁ బెఱికి శివునకర్పించినదఁట! ఈభక్తికిఁ బరమశివుని యెద గఱగినది. వాఁడు జిఱునగవు దొలుకాఁడు మొగమున దర్శనమొసఁగెను. 'ఏమిగావలెనని' శివుఁడడిగెను. ఆమె యేదియు నడుగలేదు. భక్తిక్రీతుఁడైన పరమశివుఁ డామెకంటిని మఱల నొసఁగినాఁడట. ఇఁకను గోడశిత్రిపురారి గొబ్బూరి సంగనామాత్యుఁడు – మొదలగు భక్తులెందఱో సోమనాథుని కాలముననుండిరి. వారితో సోమనాథుఁడు సేరి కొన్నాఁడు. ప్రతిదినము బ్రాణలింగ చరలింగ పూజాసహస్ర

ములే! పరమశివ స్తోత్రములే! కరస్థలివిశ్వనాథుఁడు సోమనాథునకు రచనామార్గములు వివరించినాఁడు. పాలకురికి సోమన్నకు శివదీక్షనిచ్చిన గురువు గురులింగార్యుఁడు. ఇతఁడు బెలిదేవి వేమనారాధ్యుల మనుమఁడు. పాశుపతదీక్షఁగైకొన్న నాటినుండి సోమనాథుఁడు 'గురులింగవరకరోదర జనితుండ'నని చెప్పికొనెడివాఁడు. సోమన్న రెండవగురువు కట్టకూరి పోతిదేవర. 'కట్టకూరి పోతిదేవర పదాంబుజ షట్పదుండ' నని కవి బొగడికొన్నాఁడు. ఈ కట్టకూరి పోతిదేవర యెక్కడివాఁడో యెట్టివాఁడో మనకుఁ దెలియదు.

పరమపావన పంచాక్షరీ మంత్రము జెవులఁ బడినదే తడవు – కైలాసము – సోమన్న గనులయెదుటఁ బారాడఁ దొడఁగెను. రాత్రిందివములు పరమపంచాక్షరీ మంత్రమే సోమన్న జిహ్వాపైఁ దాండవమాడ నారంభించినది. జగత్తునందలి వృషభములన్నియు నందీశ్వరులైనట్లు నానందీశ్వరుల మువ్వలరవళులే సమస్తశబ్దజాలమైనట్లు వానికి భాసింపఁజొచ్చినది. లోకమునందలి బిల్వములన్నియుఁజేర్చి, కరవీరములన్నియుఁగూర్చి, తుమ్మిపూవులన్నియు నేర్చి శివునిఁబూజింపవలెనని వాని యాస.

సముద్రజలము లన్నియు నింకిపోవువఱకు బరమశివు నభిషేకింప వలెనని వానిభక్తి. 'వడిబాఱుజలమున కొడలెల్ల గాళులు; వడిగాలు జిచ్చున కొడలెల్ల నోళులు; వడివీచు గాడ్పుల కొడలెల్లఁ దలలు; వడిజేయుసోమన్న కొడలెల్లభక్తి' యుండెనఁట. అతని పూజయందు శివుని మజ్జనోదకములకన్న మున్న యానందబాష్పములు దొరఁగెడివఁట. పూజించు

నవపుష్పరాజికిమున్న హృత్సరోజంబువిరిసెడివఁట. ధూపవాసనకు మున్న ధూర్జటిమ్రోల నంతర్గతవాసనలు వ్యాపించెడివఁట. వెలుఁగు నీరాజనంబులకు మునుపే మలహరునందె యాత్మజ్యోతి ప్రబలెడిదఁట. వినివేదిత పదార్థ వితతికి మున్నఁ దన ప్రాణపద మీశ్వరున కర్పితం బయ్యెడిదఁట. లింగార్చనావసరమున నంగచేష్టలు విడివడు చుండెడివఁట. అభవామృతం బానియాని సొక్కుటలు, సుభగలింగముఁ జూచి చూచి క్రాలుటలు, సురుచిరోక్తుల సోలిసోలి పాడుటలు, స్థిరసుఖాంబుధిఁ దేలి తేలి యాడుటలు సోమన్నకు నిత్యకృత్యములు. ఆతని యంతరంగ బహిరంగ జీవనములు రెండును దన ప్రాణలింగమే. ఈ రీతి సోమనాథుని శివదీక్ష సాఁగుచుండెను.

ఇంతలో నూనూఁగు మీసాల నూత్నయౌవనము సంప్రాప్త మయ్యెను. సామాన్యులకువలె సోమనాథునకు యౌవనముతో గర్వితమతి రాలేదు. శివభక్తి యామ్రేడితమైనది. మృదుమధుర పదబంధముగ బసవనిచరిత్ర బాడనారాటము జనించినది. తను పాడుపాట ప్రతివారి నోటిపై జిందులు ద్రొక్కవలెను. అందుకుఁ దగిన 'భాషయేది' అని యోచించినాఁడు. జానుఁదెనుఁగునఁ గవిత వ్రాయవలెననితోఁచినది. ఎందుకనఁగా దేశికవిత 'మానుగా సర్వసామాన్యంబుగా'దఁట !

తన సమకాలికులైన భక్తవీరుల నడిగి బసవనిచరిత్ర లాకలించుకొన్నాఁడు. ఆకలించుకొన్నదానిని బద్యఛందస్సు నచ్చుకట్టుగాఁ బిగింపఁదలఁచినాఁడు. కాని యట్టి ఛందస్సేది? సంస్కృతఛందస్సులను బాటించినచో నది పండితలోకమునకే

ప్రీతికరమగును. అందుచే నురుతర గద్య పద్యోక్తులకంటె సరసమై పరగిన జానుఁదెనుంగు జర్చింపఁగా సర్వసామాన్యమని నిశ్చయించుకొని కోర్కె-ద్వార ద్విపదరచనకుఁ బూనికొనెను.

ద్విపదచ్ఛందము నాఁటి జనులకుఁ బ్రాణము. నాఁడే గాదు–నేఁటికినిఁగూడ నంతే. మన పల్లెలలో నీకాలమునందును రంగనాథరామాయణమునకున్న ప్రచారము మఱే యే గ్రంథము నకును లేదనుట మనమందఱు మెఱిఁగిన విషయమే. బౌద్ధ జైనములు దమ తమ ధర్మములను 'బ్రజావాణి' యందే వెలువరించినవి. బౌద్ధమత గ్రంథములు జాతీయభాషయందే గలవు. జైనగ్రంథములు కూడ నాటి వ్యావహారికమైన 'పాలీ' భాషయే. ఆ రచయితలకు సంస్కృతము రాకగాదు. సంస్కృతము శిష్టభాషమాత్రమే యగుటచే సామాన్య హృదయములందు గాఢముగా నది హత్తికొన లేదని వారికి దెలియును. ప్రసిద్ధగ్రంథమైన కథాసరి త్సాగరము పైశాచికభాషయం దున్నది. మహాపండితుఁడైన సోమనాథుఁ డీ రహస్యమును గమనించెను. ద్విపదకావ్య రచనకుఁ బూనుకొనెను. ఆ ద్విపదలు 'వేదముల కొలఁదియై' యింటింట సంచరించునని యాతఁడెఱుఁగును.

సత్యసంకల్పుఁడగు సోమనాథుఁ డనుకొన్నట్లైనది. రచనయైన కొలఁదికాలముననే 'బసవ పురాణము' వాఁడ వాఁడలలో వెలసెను. ఏచోటఁ బదుగురు చేరిన నట 'బసవ పురాణ' ప్రసక్తి యుండెడిది. ఏయింట గడియ దీఱిక యున్న బసవపురాణ వ్యాఖ్యానము సాఁగుచుండెను. ఒకటి రెండేడు లలో సోమనాథుని నామము దెనుఁగుదేశమున బ్రతివారికి నూఁతపదమయ్యెను.

ఒక సారి సోమనాథుఁడోరుగంటికి వెళ్ళెను. ఓరుగంటి యందు స్వయంభూదేవుని యాలయము సుప్రసిద్ధమైనది. ఆ స్వయంభుని దేవళమునఁ గూరుచుండి సోమనాథుఁడు బ్రతిదినము బసవపురాణమును వ్యాఖ్యానించెడివాఁడు. కాకతీయ ప్రతాపరుద్రుఁడును శైవుఁడే. కాని వీరశైవుఁడు మాత్రము కాఁడు. ప్రతాపరుద్రుఁ డొకనాఁడు స్వయంభూదేవుని దర్శనార్థమై యాలయమునకు వచ్చెను. ఆ సమయమున సోమనాథుఁడు బసవపురాణమును వ్యాఖ్యానించుచుండెను. అసంఖ్యాక మాహేశ్వరులు చుట్టును బరివేష్టించియుండిరి. తనచే రచితమయిన గ్రంథమునుండి సోమన ద్విపద నెత్తిచదివి నప్పుడు నాదబ్రహ్మమే స్వయముగఁ గనిపించినటులుండునఁట.

అతఁడు వ్యాఖ్యానించునెడ సమస్తవేదములు యుపనిషత్తులు నానాపురాణములు సమస్త విద్యాసారము బుంజీభూతమై బలికినటులుండును. శ్రోత లానంద పరవశులగుటచే నంతటి చక్రవర్తియే స్వయముగ వచ్చినను శ్రోతలెవ్వరును లేవలేదఁట! సోమనాథుఁ డసలే చక్రవర్తిని గమనింపలేదు. ప్రతాపరుద్రుని యహంకారమున కది వ్యాఘాతమైనది. అతని యనుయాయులగు పండితుల దెసఁ జూపుసారించి మహారాజు సోమనాథునివైపు దిరిగి 'వీరెవ్వర'ని యడిగెను. పండితులు సోమనాథుని గుఱించి యంతకుముందె వినియున్నవారు. వారి కాతని పద్ధతి గిట్టలేదు. అందుచే వారు సోమనాథుని గుఱించి ప్రతాపరుద్రున కిట్లు విన్నవించిరి.

ఈతఁడొక వీరశైవుఁడు. ఈనడుమనే బసవపురాణమను నొక ద్విపదకావ్యమును వ్రాసినాఁడు. ద్విపదరచనయం దీతఁడు ప్రాసయతులఁగల్పించి యలాక్షణికముగఁ జేసినాఁడు.

సోమనాథుని గుఱించి, ప్రతాపరుద్రున కొక యువ హేళనా పూర్వకమగు నభిప్రాయ మేర్పడినది. అతఁడు గిరుక్కున వెనుదిరిగెను. తిరుగుచునే యా గుంపునైపు నొకసారి మహారాజు జూచెను. ఆ చూచిన చూపునకే యొకసుందరీమణి విశాలముఖమండలము దగిలినది. ఆమెకు బాహ్యస్మృతిలేదు. సోమనాథుని గవితావాహినియం దామె మనస్సొక మత్స్యమై యీఁదులాడుచున్నది. ఆ సుదతీమణి నామము మాచలదేవి. ఆమె ప్రతాపరుద్రుని యుంపుడుఁగత్తె. మాచలదేవి గృహామానాటి కవులకుఁ గాణాచి. ఆమె హృదయము సరసకవిత లూరు నమృతస్రవంతి. వెనుకకుఁదిరిగిన ప్రతాపరుద్రుఁ డొకసారి 'మాచలదేవీ! నీ విక్కడనా!' యని యదల్చెను. అప్పుఁడామె హృదయము జీల్చినట్లైనది. అఱ మూఁతవడిన మాచలదేవి గన్నులు దమ్మెవరో స్వప్నలోకముననుండి యదలించినట్లై దిన్నఁగాఁ దెఱచికొన్నవి.

మహారాజందికొన్నాఁడు. "మాచలదేవీ! నీవిట కెందుల కరుగుదెంచితివి?

ఈ వీరశైవ మవైదికము. ఈద్విపదరచన యలాక్షణికము. ప్రాసయతులు ద్విపదకుఁ బనికిరావు. సభ్యతారాశివగు నీవు నీసభయందుండుట నాకు లజ్జాకరము."

ప్రతాపరుద్రుఁ డీమాట లనుచున్నంతలో నామె దన స్థానమునుండి మందగమనమున నడచి వచ్చినది. ఆమె ప్రతి పదమునం దేదియోయొక సౌందర్యము నేనున్నాననుచుండెను. మాచలదేవి వినయమే రూపముదాల్చినటులు మహారాజ సమక్షముననిలుచున్నది. 'ప్రభూ!' యనియామెసంబోధించెను.

ఆ పలుకునందుఁ బ్రేమ కుసుమపాత్రమున మరందధారవలెఁ దొణికిసలాడినది. ఆమెసంబోధనము ప్రతాపరుద్రునకు వినఁబడి. నదో ! లేదో ! అతఁడు మరల గర్జించెను. "ఇది యవైదికము నలాక్షణికము" నని.

మాచలదేవి తిన్నగా నందుకొన్నది. "లక్షణమునకు ఫలము హృదయానందమే. హృదయమున కానందమొసఁగని నియమము ప్రేమలేని చెలిమివంటిది, దాని నంగీకరింపవలసిన యావశ్యకతలేదు. చక్కనికవితకు సహృదయ హృదయమే ప్రమాణము. నామనస్సున కానందమే లేనిచో నేనిటఁ గూర్చొనియే యుండను. వీరశైవ మవైదికమంటిరి. అది యవైదికమో సవైదికమో నిర్ణయింపఁ బండితులే యర్హులు. ఆ కఠినశాస్త్రచర్చలతో నాకు సంబంధములేదు. ఆ ద్విపదల యందలి తెనుఁగు పలుకుబడి నాయెదఁ గలఁచినది. ఆ కవి యావేశము లోకమునే యుఱ్ఱూత లూపుచున్నది. శాస్త్రచర్చ గావలసినచో ... ... ..."

ప్రతాపరుద్రుఁడు దనచుట్టునున్న పండితులవైపుఁ దేరి పాఱజూచెను. కొందఱి మొగములపై నవహేళనము, కొందఱికి ముఖములపై భీతి, కొందఱి వక్త్రములపై నిదమిత్థమని నిర్ణయింపలేని మూఢభావము.

అహంకారమునకు దెబ్బతగిలిన ప్రతాపరుద్రుఁడు రాజ సభయందు వాదమున కేర్పాటుసేయింపవలె ననెను. మాచలదేవి దానికిఁ జిఱునగవుతోఁ దలనూచినది. ప్రతాప రుద్రుఁ డామె చిఱునగవును గమనించియు గమనింప నేఱుల బాణమువలె వెనుదిరిగెను. సోమనాథుఁ డీ సంభాషణమును

లెక్కపెట్టినట్లేలేదు. అతఁడు పురాణమును వ్యాఖ్యానించుచునే యుండెను. మాచలదేవి కనులయంచుల గౌరవము దాండవింప వరము నభ్యర్థింప భగవంతునియెడ కేతెంచు భక్తురాలివలె సోమనాథునిదరిసినది. అతఁడు దలనెత్తఁడు. ఆమెకాతని బలుక రించు ధైర్యములేదు. మాచలదేవి యేపుణ్యాఖండము ఫలించి నదో యోరంత ప్రొద్దునకు సోమనాథుఁడు దలనెత్తి చూచి నాఁడు. చూచినవాఁడెందులకో ననాదరముగ 'నెవరు ? ఏమి ?' యనెను. "ఈ యణువు నామధేయము మాచలదేవి. భిక్షార్థమై దమ్ముఁ దరిసితి" నని పలికెను.

అదివిని సోమనాథుఁడు నవ్వెను. నవ్వుచునే "వీరశైవుఁ డడిగినవారికి లేదనఁడు. నీవు శివదీక్షితురాలివేని నీ భిక్ష శివార్పణముగఁ జెల్లింతును."

మాచలదేవి యిట్లనెను "నా దైవ మీ స్వయంభూ దేవుఁడు. కాకతీయనృపాలుర ఖడ్గమునకాయువుబోసిన దీ పరమ శివుఁడే. నామంత్రము బంచాక్షరి. శరణులునానిత్యదైవములు. నేను శైవదీక్షితనే. నాయడిగినవరము శివార్పణముగఁ జెల్లింప వలెను."

సోమనాథుఁడామె గొంతుకస్వరములోఁ దన కంఠస్వర మును మేళవించి 'శివార్పణ' మనెను.

ఆ సమయమున మహాకవి ఫాలము ముడుతలు పడెను. విభూతి శిరముపై నా సమయమున జల్లుజల్లుగ రాలి యాసన్ని వేశమున కొక సౌభాగ్యమును జేకూర్చినది.

వాదభిక్ష కాకతీయుల నిండుకొలువునందు శివపార మ్యము సిద్ధాంతీకరింపఁబడవలెను. కాకతీయ ప్రతాపరుద్రుఁడు వీరశైవము నవలంబింపవలెను. మాచలదేవి యావేశపూరితమై యున్నది. ఆమె నిటలముపై నున్న గుంకుమబొట్టు శివుని జిచ్చుఁటకన్ను విధానఁ గనకనలాడెను.

"నాకు భవుల (భవులు=శైవమతదీక్షఁ గైకొనినవారు) దర్శన స్పర్శనాలాపములు పనికిరావు. ఈ నియమమునకు లోపములేక వాదము నేర్పాటు సేయింతువేని శివపారమ్యా మును సిద్ధాంతీకరింతును."

తమ యానతి ప్రకారమే యేర్పాటు సేయింతునని మాచలదేవి ముసిముసినవ్వులు నవ్వెను. సోమనాథుఁ డామె నవ్వులతీరు గమనింపనేలేదు. అతనికిఁ గైలాసముననున్న భృంగి దన్నావేశించినట్లైనది. తటుక్కున సుడిగాలివలె లేచి యాతఁ డటనుండి యదృశ్యమయ్యెను. పాలకురికి సోమనాథుని బ్రవ ర్తన మనేక కవుల కాతిథ్యమిచ్చిన మాచలదేవికి విచిత్రముగ గన్పట్టనేలేదు. అతఁడెంతకవియో యంతటి విరక్తుఁడు. శివుఁ డాతనికిఁ బడిగాపని మాచలదేవి యెఱుఁగును. సోమనాథుఁడు వివాదమున కంగీకరించెనని రాజసభలోఁ దెలిసినది. సోమనా థుఁడన్న నదేమియో పండితులకు భయము. ఆతఁడువచ్చునను మాటవిన్నప్పటినుండి యెదలలోఁ బాములేపాములు. ప్రతాప రుద్రున 'కావీరశైవుని పనిపట్టించవచ్చు' నని మనస్సున నొక యానందమే యుండెను. కాని సోమనాథునితో వాదమునకు దలపడు బండితులేరీ? కొలువునందున్న పండితులందఱు గుమి గూడి చక్రవర్తితో 'సోమనాథునితో వాదించుటకు వేరొక

పండితు నాహ్వానింపవలె'నని విన్నవించిరి. దక్షిణదేశమునుండి చక్రపాణి రంగనాథుఁడను ప్రసిద్ధ విద్వాంసుఁ డొకఁడు గాకతీయరాజసభ కాహ్వానింపఁబడెను. సోమనాథుఁడెంతటి వీరశైవుఁడో ఇతఁడంతటి వీరవైష్ణవుఁడు. వాదదిన మాసన్నమైనది. శిష్యులైన వీరమాహేశ్వరులు వెంటరా సోమనాథుఁడు వాదమంటపమునకు బయలుదేఱెను. అతఁడు పల్లకిలో గాక రెండెడ్ల బండిపై నెక్కి రాచకొలువునకుఁ బ్రయాణ మయ్యెను. ప్రత్యర్థులగు పండితు లీతని నవమానపఱుప నెంచిరి. మర్యాదార్థము సోమనాథుని మార్గమధ్యమున నెదు ర్కొనుటకుఁ గొంతమంది పండితులను వారంపిరి. విద్వాంసులు సోమనాథుని హాస్యముసేయుటకై కృత్రిమములైన లింగ కాయలు ధరించివచ్చిరి. సోమనాథున కీ మోసము ముందే తెలియును. అతఁడు గన్నులెత్తి వారివైపు వీక్షించెను.

అట్లు వీక్షించినంత నాకృత్రిమములైన లింగకాయ లచ్చముగ లింగములేయైనవి. ఆ పండితులు దడవిచూచు కొనిరి. వారి శరీరములన్నియు సిగ్గుతోఁ జిమిడిపోయినవి.

సోమనాథునియెడ్లబండి రాజద్వారమును సమీపించినది. అట నొక బ్రహ్మాండమైన గజలక్ష్మీ విగ్రహ ముండెను. ఆ విగ్రహమును వీక్షించి సోమనాథుని బండికిఁగట్టిన యెడ్లు బెదరినవి. అవి ముందున కడుగువేయలేదు. వానిబేలతనముఁ గాంచి యచ్చట నిలుచున్న చదువరులు గవకవనవ్విరి. పటపట సేతులుదట్టిరి. సోమనాథుఁడు వంచినదల నెత్తిచూచెను. అతని గన్నులయందు నిప్పురవలు వెలికి నిగిడినవి. ప్రళయకాలరుద్ర హుంకారములోని యొకయలఁతిచాయ సోమనాథునివాక్కున

వెలసినది. "ఏమీ! మాహేశ్వరుని బ్రయాణమున కాటంకమా! గజలక్ష్మి! త్రోవవిడుతువా! లేదా!" సోమనాథుని యీమాటలింకను ముగియనేలేదు. విగ్రహము దునియలై క్రిందఁబడినది. త్రోకలెత్తి మాహేశ్వరుని వృషభములు అంకెలువేసి ముందుకుదూకినవి. విద్వాంసుల మొగములపై నెత్తురుజుక్కలేదు. అటనున్నవారు గొందఱు బరువెత్తి రాజున కీవర్తమానమును విన్నవించిరి. వానిగర్వము దలవంచినది. ఆతఁడు బరువెత్తివచ్చి సోమనాథుని బదములపైఁ బడెను.

చక్రపాణిరంగనాథునితో సోమనాథునకు వాదమారంభమయ్యెను. ఇరువురికి నడుమఁ దెరవేయఁబడెను. వాదిప్రతివాదులకు హస్తిమశకాంతర ముండెను. రంగనాథుని వాదసరణిఁ జూచి "వీనిని జయింప మాతండ్రిగావలెనా! నేను జాలుదు" ననెను సోమనాథుని సుతుఁడు చతుర్ముఖ బసవేశ్వరుఁడు. అభిమన్యుని విక్రమమువంటి వానివిక్రమమును జూచి కాకతీయరాజు మెచ్చుకొనెను. రంగనాథ బసవేశ్వరులకు వాదము మొదలైనది.

రంగనాథుఁడు సెప్పినయుక్తు లన్నిఁటిని జతుర్ముఖుఁడు ఖండింపఁదొడఁగెను. కొన్నిటి నంగీకరించి ఖండించెను.

చతుర్ముఖ బసవేశ్వరుని వాదప్రౌఢిమకుఁ బండితులు నివ్వెఱపోయిరి. రంగనాథుని శిరము భూమిఁజూచినది. ఆతఁడు వచ్చినత్రోవనే వెనుకకు మఱలెను. మఱలిన రంగనాథుఁడు శ్రీశైలమున మల్లికార్జును సేవింపకయే యేఁగినాడు. శివద్వేషము రంగనాథుని గనులు మూయించినది. ఆతఁ డంధుఁడయ్యెను.

ఆ రంగనాథుఁ డటులే యహోబలమున కేతెంచెను. నరసింహుని దర్శింపఁ గనులేవి? అంధుఁడగు రంగనాథుఁడు దనకుఁగనులుదయసేయవలెనని నరసింహునకేటికోళ్ళర్పించెను. ఆ స్వామి ప్రత్యక్షముగ బలుకలేదు. రంగనాథునిమదికి లక్ష్మీనృసింహులకుఁగరుణలేనట్లుగన్పట్టినది. వైష్ణవపండితుఁడు "గింకర్తవ్యతావిమూఢుఁ" డయ్యెను. ఇంతలోఁ గలయందు రంగనాథునకు నరసింహుఁడు దర్శనమిచ్చి వానికి శివపారమ్యమును బోధించెను. 'రంగనాథునకప్పుడు బశ్చాత్తాపముగలిగినది. ఆతఁడు వెనుదిరిగి శ్రీశైలమునకు వచ్చెను. రంగనాథుఁడు దీనవదనుఁడై యోరంత ప్రొద్దు మల్లికార్జునుని బ్రార్థించెను. కడపటికా స్వామికి దయగలిగి "ఓయీ! నీవు శివభక్తులను ద్వేషించితివి. శివభక్తులు శివునకెచ్చు. నీవు మరలనేఁగి సోమనాథుని బాదములే యాశ్రయింపవలయు. ఆతఁడు భృంగీశ్వరునవతారమని దెలియుము. అయినను నీకు మద్భక్తసంరక్షణ తత్పరత్వ మర్థమగుటకై యొకకంటినిమాత్ర మొసఁగెద. దాని సాయమున నీవు సోమనాథుని చెంతకుఁ బొమ్ము. ఆతఁడు గరుణించిననే నీకు రెండవకన్ను రాఁగల" దని పలికెను.

ఇట్లు బలుకుటయు రంగనాథుని గన్నువచ్చుటయు నేకకాలముననే జరిగెను. పరమానందభరితుఁడగు వైష్ణవ విద్వాంసుఁడు మల్లికార్జును నానతితో సరాసరి యోరుగంటికి వచ్చెను. ఆతఁడు బశ్చాత్తప్తుఁడై దనచెంత కేతెంచునని సోమనాథుఁడు ముందే యెఱుఁగును. స్వయంభూదేవాలయమునఁ బురాణకాలక్షేపముననున్న సోమనాథుఁడు రంగనాథుఁ జూచి ఫక్కుమని నవ్వెను. రంగనాథుఁడు పెన్నిధివలెసోమన్న పాదములఁ గౌఁగిలించుకొనెను.

ఎట్టకేలకుఁ గరుణఁగొన్న సోమన్న "నీకు రెండవకన్ను వచ్చుఁగాత"మ్మని పలికెను. రంగనాథుని ద్వితీయలోచనము దామరపూవువలె విచ్చినది. దానితో వానిజ్ఞానమును, విచ్చి నటులైనది. తనకు "శివదీక్ష నొసఁగుఁ"డని యార్యుఁడై రంగనాథుఁడు బ్రార్థించెను. సోమన్న వానిని దనతనయునివెంత దీక్షితుఁడు గావలసినదని నియోగించెను. నాఁడు రంగనాథుఁడు చతుర్ముఖ బసవేశ్వరునకుఁ బ్రత్యర్థియు నేఁడు శిష్యుఁడునగుట శివలీల.

రంగనాథుఁడు వీరభద్రవిజయ, శరభ చరిత్రాదులను రచించి గురుపాదముల కర్పించెను. 'శ్రీగిరినాథవిక్రమ' మని యేనూఱుసీసపద్యములుగల తెలుఁగుగ్రంథమునుగూడ రంగనాథకవి రచించెనఁట! 'నయనరగడ' యనునామాంతరము గల 'శివభక్తిదీపిక' యను మఱియొకకృతి యితని పేరిఁటనే గలదు. సోమనాథుని జీవితగాథను గావ్యముగ రచించిన 'దొంతెదార్యకవి' ఈ రంగనాథుని చరిత్రమును పేర్కొనెను. కాని యాతఁడు, రంగనాథుని నామమును 'శ్రీరంగకవి' యని వాడెను. ఇది రంగనాథుఁడు వైష్ణవమును వీడ్కొన్న దరువాత వచ్చినపేరై యుండవచ్చును.

సోమనాథుఁ డోరుగంటిలోనుండఁగాఁ 'బెఱుఁగుకురికి శాస్త్రి, నేతికురికి శాస్త్రి' యనునిర్వురితో నాతనికి వాదమేర్పడెనఁట. అప్పుడు సోమన్న 'బాలకురికినుండి వచ్చినవే గదా! యీ నేతికురికి బెఱుఁగుకురుకు' లని వారి నవహేళనమాడి జయించెనఁట.

గణపుర ప్రభువైన జగదేక మల్లునిచే సోమనాథుఁడు లింగముద్రతోఁ గొంతభూమినిఁ బడసెను.

బసవపురాణమును రచించిన తర్వాత సోమనాథుఁడు 'పండితారాధ్య చరిత్రమును' వ్రాయఁదలపెట్టెను. ఈ పండితారాధ్యుఁడు సోమనాథునకుఁ బూర్వుఁడు. మహోద్ధతుఁడైన యారాధ్యుఁడు. అతని చరిత్రఁగూడ సోమన్న ద్విపదగనే రచించెను. ఆ గ్రంథమం దైదు ప్రకరణములు గలవు. మొదటి దగు దీక్షా ప్రకరణమునందు వైదికవాక్యములచే వీరశైవము సమర్థింపఁబడినది. పురాతన ప్రకరణమునందు జిరంతనులైన భక్తుల గాథలు రసభరితముగ వర్ణింపఁబడినవి. వాద ప్రకరణమున నన్నిమతవాదములను సోమనాథుఁడు సయుక్తికముగ ఖండించెను. సోమన్న వాదపద్ధతి ప్రత్యేకమైనది. అతఁడు ముందు బ్రతివాదుల వాదపద్ధతిని సవిస్తరముగ ననువదించును. తర్వాత నుద్ధతుఁడై దానిని ఖండించును. మహిమ ప్రకరణమున బండితారాధ్యుని మహిమలు వర్ణింపఁబడినవి. పర్వత ప్రకరణమున శ్రీశైల మాహాత్మ్యము విస్తృతీకరింపఁబడినది. ఈ ప్రకరణముఁ జూచినచో సోమనాథున కానాఁటి యాచారములతో' సామాన్యజనులతో నెంతటి జోఁకువయుండెనో యర్థమగును. రచనామార్గమున శైవకవులే స్వతంత్రులు. అందునను సోమనాథుఁడు, మఱియుఁ బ్రచండుఁడు. ఆతని కవిత్వమును జూచినచో సోమనాథునకురానివిద్యలేనట్లు గన్పట్టును. శాస్త్రములు, బురాణములు, నుపనిషత్తులు. స్మృతులు, నుపపురాణములు, ఆగమములు నాతనికిఁ గరతలామలకములు. వ్యాకరణము, ఛందోలంకారములు, షట్తర్కములు, వైశేషిక హఠయోగములు, నేత్రవైద్య, విషవైద్య, రసవాద, జ్యోతిషములు,

భరత సంగీతాదులన్నియు వాని నడకకు ఘంటాపథములు. ఆంధ్ర, కర్ణాట, తమిళ, మహారాష్ట్ర, సంస్కృతభాషలయం దమోఘపాండిత్యము సోమనాథున కుండెను.

నానా దేశాచారములు మతసిద్ధాంతములు నానా విధాహార వేష సంప్రదాయము లాతనికిఁ దెలియును. ద్యూతవిద్య, శకునశాస్త్రము, గోటలనిర్మాణ పద్ధతులు మొదలగున వెన్నియో సోమనాథుఁడు వివరించిచెప్పెను. ఆతఁడు గేవలము, వేదజడుఁడు గాఁడు, గొప్పలౌకికుఁడు. ఆతనిపాండిత్య మెంతగొప్పదియో యుద్ధతియు నంతగొప్పది.

సోమనాథుని ద్విపద కవిత, యన్నిద్విపదల వంటిది గాదు. రచనయందేగాక లక్షణమునందుఁ గూడ నాతఁడొక క్రొత్త త్రోవఁద్రొక్కెను. ద్విపదలయందుఁ బ్రాసయతి బనికిరాదు. దాని నాతఁడు వాడెను. పాదపాదమునకును బదములు దునిఁగిపోవుట ద్విపదయొక్కలక్షణము. సోమనాథుఁ డానియమము నుల్లంఘించి ద్విపదరచనయం దనేక ఛందో భేదములు నడపెను. రచనలో నీతని నవీన గుణ సనాథత్వ మెక్కువ ప్రకాశించినది. కథావస్తువునందు గ్రొత్తఁదనము సంపాదించి విడివిడిగా నున్న భక్తుల కథలకు రమ్యతఁ గ్రోడీకరించి యవి ప్రత్యేకకథలు గానట్లు గన్పఱచెను. చెప్పిన విషయమునే మఱలఁ జెప్పుచున్నను నవి బునరుక్తులు గానట్లుఁ దలపింపఁజేయుట సోమన్నయందు దొడ్డగుణము. దేశి నుడికారమును సంపూర్ణముగ నవలంబించి జాతులు, రీతులు, నేతు లుట్టిపడ రచించును. అనుప్రాసాది శబ్దాలంకారములను బలాత్కరించి తెచ్చిపెట్టఁడు. సహజముగ నాతనికవిత్వమున ధారలు నుపమాద్యలంకారములను సందర్భోచితముగ

నుపయోగించి మనస్సున కానందము గల్పించును. వింత వింత సామెతలు వాడును. ఇట్టివెన్నేని గుణము లీతని రచనములఁ జూడవచ్చును. ఒక మహాకావ్యమన్న నన్నిరసము లుండును. అందు శృంగారమును నొక్కటి. సోమనాథుని శృంగార మితర కవులశృంగారమువంటిది కాదు. తనశృంగార మున కాతఁడు 'భక్తి శృంగార' మని పేరుపెట్టెను. బసవేశ్వరుని బెండ్లికొడుకు వేషము భక్తిశృంగారమైనట్లుగా గవి వర్ణించెను. నిజమునకు సోమనాథునిగావ్యములలో బసవేశ్వరుఁడును, బండితారాధ్యుఁడును నాయకులుగారు. వారు నాయికలు. వారికి నాయకుఁడు శివుఁడు. అపూర్వమగు నిట్టి భక్తిశృంగార మును సోమనాథుఁ డత్యద్భుతరీతి వర్ణించెను.

ఆంధ్రవాఙ్మయమునందుఁ గవితలో హాస్యరసము జాల తక్కువ. పాలకురికి సోమనాథుఁడు దన కావ్యములందు మధురహాస్యమును బోషించెను.

సోమనాథుఁ డష్టవిధ కవిత్వములఁ జెప్పఁగలఁడు. కాని యాతఁడు ముఖ్యముగ వాచకుఁడు ఏవిషయము నెత్తికొన్నను వ్యంగ్యధ్వనులను విడిచిపెట్టక సవిస్తరముగ వర్ణించి ననేగాని సోమనాథునకుఁ దృప్తియుండదు.

మాచలదేవి సోమనాథుని దన యాదరమునకుఁ బాత్రునిగాఁ జేసికొన నెంతయో బ్రయత్నించెను. ఆమె మహాదాత్రి. కాని యాతఁడు నిరీహుఁడు. అందుచే నామె యత్నము లన్నియు విఫలములైనవి. కాని సోమనాథుని ద్విపదలన్నచో నామెకుఁ బిచ్చియాదరము. త్రికాలవేదియగు సోమనాథుఁ

డోరుగంటికి రానున్న యాపదను ముందే గమనించెను. దేశము త్వరలోఁ దురుష్కాక్రాంతముగానున్నది. తనవంటి నియమస్థు లట నుండరాదు. అందుచే నాతఁడు దన శిష్యుఁ డగు నిందుటూరి యయ్యన్నను బిలిపించెను. అతఁడుఁ బ్రతాప రుద్రునిదగ్గఱ మంత్రి. వానినుండి 'దోకిపర్తి' నగ్రహారముగ సోమనాథుఁడు బడసెను. అందు గొంతకాలము శిష్యులతోఁ గూడ సోమనాథుఁడు వసించెను. ఒకానొకనాఁడు శిష్యులతో నాతఁ డిట్లనెను. "నాకు వార్ధకము గదిసినది. ఇఁక బాహ్యకర్మ ములు మాని సమాధిస్థితిని బడయుదు" నన శిష్యు లవనత శిరస్కులై యేమియుఁ బలుకలేదు.

ఆంధ్రదేశమునువీడి సోమనాథుఁడు గర్ణాటకమును జేరెను. 'శివగంగ' క్షేత్రమునకుఁ జేరువను, 'గలికె' యను నగ్రహారమును దన నివాసముగ నేర్పఱచికొనెను. అందొక సమాధిఁ గల్పించుకొని యందు దిట్టముగ విబూది వోయించి దానిపై సోమనాథుఁడు గూర్చుండెను. తన శరీరమును గాపాడ శిష్యులను నియోగించి సోమనాథుఁ డాయతప్రాణుఁ డయ్యెను. కొంతకాలమునకుఁ బరమశివుఁడు బ్రత్యక్షమై కైలాసమునకుఁ గొనిపోయెద రమ్మనెనఁట. అప్పుడు సోమ నాథుఁ డిట్లనెనఁట.

"అభవా! సమాధినిఁదెఱచి యితరు లెఱుఁగకుండ నీవు నను గొంపోదువేని సోమనాథుఁ డెక్కడికేని బాఱిపోయెనని భావింతు రందురు. సమాధినిఁ దెఱువక గొనిపోదువేని సోమ నాథుఁడు సమాధిలోఁ గ్రుళ్ళిపోయె నందురు. ఈ రెండపవాద ములును గలుగనీయక ననుఁ గైకొని పొమ్ము. భూమిజనులు-

నీరూఁపులో నారూఁపు జూచునట్లు నాకుఁ బ్రియమైన నంది రూపమును స్ఫటికమయముగఁదాల్చి తద్గర్భమున ననుఁ జేర్చి. కొని లోకులకు సంశయము దీఱునట్లు నా సమాధిపైఁ గొంత దడవు గానవచ్చి భక్తజనులు బ్రస్తుతింప నను నీలోకమునకుఁ గొనిపొమ్ము." అంతట శివుఁ డట్లే సేసెనఁట.

పై విషయములు సోమన్న శిష్యున కాఱవతరమున వచించినవి.

సోమనాథుఁ డాంధ్రవాఙ్మయమున నొకసుడిగాలి వంటి వాఁడు. అంతటి యుద్ధతి యంతటివైదుష్యము నతనికే గలదు. వీరశైవమంతరించినను గవిగామాత్రము సోమనాథుని దెలుఁగు వారు మఱువలేరు.



# అన్నమాచార్యుఁడు

పూర్వకాలమున దేశమును 'నాఁడు'లుగా విభజించుట వాడుక. ములికినాఁడు, వెలనాఁడు, వేఁగినాఁడు మొదలగున వన్నియు నిట్టివిభాగములే. పరిపాలనా సౌకర్యములకై నాఁటి రాజు లట్టివిభాగములఁ గావించుచుండిరి. ఆ నాఁడులలోఁ బొత్తపినాఁడును నొకటి. ఈ పొత్తపినాటియొక్క యెల్లలెంత వఱకో వివరముగాఁ దెలియదు. కాని ప్రసిద్ధమైన కాళహస్తి క్షేత్రము, నారాయణవనము మొదలైన వన్నియుఁ బొత్తపి నాఁటిలోనివే. ఈపొత్తపినాట నేటి కడపజిల్లాలోని గొంతభాగ మును జేరియుండెడిది.

ఆనాఁడు దేశము సుభిక్షముగ నుండెను. వృత్తుల యందుఁ బోటీలు లేవు. పదిమందిని జెఱచి యొకఁడు లాభ మందవలె నన్న దురూహలు లేవు. జనులయందుఁ బార మార్థికచింత మెండుగా నుండెను. నాఁటి సామాజిక నియమ ములు ధర్మప్రాణములు. అందుచే బ్రకృతికి మానవునిఁజూచినఁ బరమదయ. జనులు వానలకై నిరీక్షించుటలేదు. నెలకు మూఁడువానలు సువృష్టిగఁ గురియుచుండెను. నాఁటిభూమి సంతతసస్యశ్యామలాంబర. ఆ నదులు నిరంతర యౌవనమున నవ్వుచుండెను. అపుడపుడు సింహాసనములకై రక్తస్నానములు గావించుకొను రాజుల గడబిడలతోఁదప్ప మఱి దేనితోడను నాఁటి మానవజీవితమున కశాంతిలేదు. ఆ గడబిడయు నొక వానకాలపుఁ బొంగువలెఁ దళ్ళిపోవుచుండెను.

పొత్తపినాఁటి రాజనపుఁజేలు ముక్కారు బండుచుండె డివి. పసిడిటెంకాయవృక్షములు బసవుల పాలతోడనే పెరుగు

చుండెను. ఊరూరం గ్రొవ్విరుల యుద్యానములు, జెంగల్వ కొలంకులు నుండెడివి. రసదాటి చెఱకుతోటలు, నన(టితోటలు, ముంతమామిడిచెట్లు, నమృతరసము లూరించు రసాలవృక్షములు బొత్తపినాటి కమూల్యాభరణములు.

'తాళ్ళపాక' యను గ్రామము పొత్తపినాటిలోనిదే. అయూర నెలకొన్న చెన్నకేశవస్వామి అశ్రితరక్షాపరాయణుడు. ఆ స్వామికి మున్నూటయఱువది నాళ్ళను భక్తులు దివ్యభోగములు సమర్పించుచుండిరి. తాళ్ళపాక పరిసర ప్రదేశములలో మున్ను 'నవనాథసిద్ధులు' సంచరించిరంట. పాదరసమును బంగారు సేయుటకై యుపయోగపడు నమూల్యములగు మూలికలు వారి కచటనే దొరకినట్లు బ్రతీతిగలదు. ఆ నాం డాయూరియందుం బ్రసిద్ధిగన్న శ్రోత్రియ కుటుంబము లుండెడివి. విద్యావంతు లనితర సాధారణమైన గౌరవమందిన కాలమది. అందుచే నా బ్రాహ్మణ కుటుంబములు సంపన్నములు. ఇతరులు గూడం బేదఱిక మెఱుంగక యుండిరి.

ఆ యూర విఠ్ఠలుండను నొక బ్రాహ్మణుం డుండెను. అతండు నందవరీకుండు. అశ్వలాయన సూత్రశాలి. అతనిది భరద్వాజగోత్రము. విఠ్ఠలుండు ఋగ్వేది. అతండు మితభాషి, నియమిత వర్తనుండు, దయార్ద్రహృదయుండు. విఠ్ఠలుం డనురూపవతియైనభార్యతో గార్హస్థ్యమును నిర్వహించుచు నిహమును బరమును సాధించు చుండెను. కొన్నిదినములకు విఠ్ఠలున కొక కుమారుండు గలిగినాండు. తండ్రి వానికి నారాయణుండని నామకరణముం గావించెను. ఆ పిల్లవానికి బాల్యము గడచినది. ఆకారపుష్టి యేర్పడెను. అక్షరపుష్టి మాత్రము శూన్యమై

యుండెను. కుమారుఁడు లేని యా తండ్రికీ సుతోత్పత్తి నేఁడు నూత్నవిచారమునకే దోహదమైనది. తాను చెప్పి చూచెను; దండించెను. ఏమిచేసిన నాతఁడిసుకపైన జేయియే వైవఁడు. ఊరియం దితరోపాధ్యాయుల కప్పగించెను. నారాయణుఁడు బడికిఁ బోయినఁగదా! జదువువచ్చుట. వాఁడీతగొట్టుటకై బావులు దిరుగును. తనవంటి గొందఱిని జతసేర్చికొని కోతి కొమ్మచ్చి యాడుటకై దోటలవెంటఁ బడును. నారాయణుఁడు సేరినయేబడియు నెలకుఁబైనసాఁగదు. తక్కినపిల్లలందఱు వీనిప్రాపు జేరి చెడిపోదురు. అయ్యవారిపాఠములు వారికే యొప్పగింతురు. అందుచేఁ దాళ్ళపాకలో నేగురువుగాని యాశిష్యుని దమబడిలో జేర్చికొనకుండిరి. తండ్రియగు విఠలునకుఁ దనకుమారుని ప్రవర్తనము దుస్సహమైనది. నారాయణుని తల్లిమాత్రము "వాని నెందు కేడుపింతు" రని కుమారుని వెనుకవేసికొని భర్తను మందలించు చుండెడిది. ఇఁక నారాయణునకుఁ జదువుసంధ్య లంటుట యెట్లు? విఠలుఁ డొకయుపాయమును వెదకెను. తాళ్ళపాకకు సమీపముననే 'యూటుకూ'రను గ్రామముండెను. దానియందు విఠలునకు దగ్గరచుట్టము లుండిరి. వారియింట విఠలుఁడు గుమారుని విడిచివచ్చెను. తన కుమారునకుఁ గొంచెము గంటిబెదురుగూడ బెట్టుఁడని బంధుగులను హెచ్చరించెను.

బంధుగులు నారాయణు నొకబడిలో నొప్పగించిరి. నాటినుండి యూటుకూర నారాయణుని చదు వారంభ మయ్యెను. ఊరు విడిపించిన వెంటనే నారాయణుని పరాక్రమము దగ్గినది. కన్నతల్లి లేకపోవుటచే నాహార సౌకర్యము గూడఁ గఱవయ్యెను. ఇంటఁ బ్రియవచనములుగూడ సున్న

యైనవి. తన్నుఁజూచిన ప్రతియొకరుఁ జీదరించుకొనుచుండిరి. పైగా మీనాయన గంటిబెదురు బెట్టుమనెనని యధికార వాక్యము నుదహరించుచు 'గంటిబెదురును' దాడనములవలఁ కన్వయింపఁ జేయుచుండిరి. ఆ బడిపంతులుగూడ నంత దయఁ జూపనివాఁడు. క్రొత్తలో రెండుమూఁడు దినములు సామమున విద్యాబోధనము సాగినది, నాలుగవరోజునుండి యుపాధ్యాయుఁడు బెత్తపుఁబూజ నారంభించెను. నారాయణుఁడు కదల రాదు; మెదలరాదు; నిరంతరము గురువులబెత్తము దనపైననే యాడుచుండెను. ఇంటికి వచ్చిన భోజనసౌకర్యము లేదు. బందుగులు గద్దించి పిడికెడన్నముఁ బెట్టుచుండిరి. అయ్యవారి శిక్షలు దినదినమునకుఁ జిత్ర విచిత్రములగు నవతారముల ధరించుచుండినవి. గుంజిళ్ళుతీయించుట, గోడకుర్చీవేయించుట, బడిలో నయ్యవారు, నింట బందుగులు దన్ను శిక్షించుటవలన బాలకుఁ డలయుచుండెను. నారాయణుఁడు జదువును; కాని యక్షరమే వానినాలుకపై నిలుచుటలేదు. వాఁ డేమిసేయును ? పైగా విపరీతములగు శిక్షలతో నారాయణుని శరీరము మొద్దు బాఱినది.

ఊటుకూరియందుఁ 'జింతలమ్మ' యను నొక గ్రామ దేవత యుండెను. ఆమెగుడి శిథిలమైనది. ఆ యాలయమునం దొక త్రాచుపా మున్నదని యూరియందు వాడుక. ఆమాట నారాయణుని జెవిని బడినది. దెబ్బలతో విసిగి వేసారిన బిల్ల వానికిఁ దనజన్మము వింత యనిపించినది. చింతలమ్మ దేవాలయమునందలి త్రాచుపాముననకాహుతి కాఁదలఁచెను. నారాయణుఁడు వెంటనే గుడిలోని కేఁగెను. త్రాచుపామున్న పుట్టయొక్క ముఖము మృత్యుముఖమువలె నున్నది. జీవితాశ

లేని యాపిల్లవాఁడు వల్మీకముఖమునఁ జేయి దూర్చెను. దైవగతి విచిత్రమైనది. హాలాహలమునం దమృతమును, సుధాధారయందు హాలాహలమును సృజించుట దాని క్రీడ. సంవత్సరములకొలఁదియు దప మొనరించినను గనపడని యాదేవి జంతలమ్మ బాలునియెదుట జిఱునగవుననిలువబడినది. ఆ జగన్మాత కన్నతల్లివలె శిశువుశిరము నిమిరెను. ఆమె యిట్లా బాలకునిఁ బ్రశ్నించెను. తెలిసియుఁ దెలియనిదానివలె దేవతలును లోకవృత్తమునే యనుసరింతురు.

"వత్సా! నీ విట కేలవచ్చితివి? ఊరివా రెవ్వరికి నీశిథిలాలయము సొచ్చు గుండెలులేవు. పైగా నిచట ద్రాచుపాము న్నదను ప్రసిద్ధియొకటి యున్నది. అది నీచెవిని బడలేదా!"

పిల్లవానికంట నీరుదిరిగెను. వాని కామె దేవతయని తెలియదో! తెలిసినను నాజగజ్జనని దివ్యదర్శనమునందలివిలువ నెఱుఁగఁడు. అంతట వాఁ డిట్లు బదులొసఁగెను.

"మాతా! ఇటఁ ద్రాచుపా మున్నదని దెలియును. తెలిసియే వచ్చితిని. ఎంతయత్నించినను నాకుఁ జదు వంటుటలేదు. బడియం దుపాధ్యాయులును, ఇంట బందుగులును శిక్షించుచున్నారు. ఈ దినదినగండములతో నాకు జీవితముపై రోఁతగలిగినది. అందుచే నీపుట్టచెంతకు వచ్చితిని. ఈనాచేతిని బుట్టలోనిడి పామును మేల్కొలుపుచున్నాను."

వానిమాటల కాదేవి నవ్వెను. ఆ నవ్వుతో నారాయణుని హృదయమం దేదోపరివర్తనము కలిగినది. ఆదేవీముఖమునందు దన్ను గన్నతల్లిముఖము వానికిఁ గన్పట్టెను. ఆమె మందమధురముగ నిటులనెను.

"నాయనా! ఆత్మహత్యా ప్రయత్నమును వదలు కొనుము. చదువు బాగుగవచ్చు నుపాయమును నేనెఱిఁగింతును."

పిల్లవాఁడు వల్మీకముఁనుండితనహస్తమును వెలికిదీసెను. అమాయికముగ నేదీయుపాయమును జెప్పుమని వినయపూర్వకముగ నడిగెను.

ఆమె యిట్లనెను. "నీవు వెంటనే బయలుదేఱి యూరికిఁ బొమ్ము. ఈయయ్యవారిదగ్గఱ నీకుఁ జదువువలదు. మీతాళ్ళపాకయందుఁ జెన్నకేశవస్వామి గలఁడుగదా? నీయయ్యవారతఁడే. చెన్నకేశవునియాలయమునకు నీవు వలసుట్టి తిరుగుము. ఆయన దయవలన నీకు సమస్తవిద్యలును సమగ్రముగ వచ్చును. వెంటనే పొమ్ము. మఱియు నొకమాట వినుము. మీవంశమున మూఁడవతరమునం దొక మహాపురుషుఁడు జన్మించును. వాఁడు వంశోద్ధారకుఁడై యఖండకీర్తిగాంచును. నీకుఁ జదువు దప్పకవచ్చును. నీయూరుఁ జేరుము.

ఈమాట లనుచునే దేవి యదృశ్యమయ్యెను. పిల్లవాఁడు దల యెత్తి చూచెను. దేవీమూర్తి యగుపడలేదు. వెంటనే యూరికి బయలుదేఱు మను వాక్యములు మాత్రము రెండుమూఁడుమారులు వినఁబడెను. తఱువాత నాపలుకులే వానిచెవియందు మాఱుమ్రోగుచుండెను.

పిల్లలహృదయము కుత్సితము లెఱుఁగదు. విమర్శ లెఱుఁగదు. విషసన్నిభమగు లోకజ్ఞానము విశ్వాసముఁ జెఱచును. వారి కేమాట జెప్పినను వెంటనే నమ్ముదురు.

నారాయణుఁ డింటికిఁ బోవనేలేదు. గుడినుండి సరిగాఁ దన యూరిదారిఁ బట్టినాఁడు. మధ్యాహ్నభోజనవేళకుఁ దాళ్ళపాకఁ జేరెను. కుమారునిఁ జూచిన వెంటనే విఠ్ఠలుఁడు గనులెఱ్ఱసేసి యెందుకు వచ్చితి వని గద్దించెను. నారాయణుని తల్లి యడ్డమువచ్చి నాయనా! భోజనము సేయుదువుగాని రమ్మనెను. "ఇంటిలోఁ జెప్పి వచ్చితివా! లేదా!" యని విఠ్ఠలుఁడు గద్దించెను. నారాయణుఁడు మాట్లాడలేదు. వాని వాలకము జూచి యింటఁజెప్పక వచ్చినాఁడని విఠ్ఠలుఁడు గ్రహించెను. కాని మఱలఁ దానదలించిన నెక్కడికేనిఁ బోవునేమో యను భయముచే నూరకుండెను.

నారాయణుని తల్లి వానిని స్నానము సేయింపనేగెను. వీపుపై వాత లుండెను.

"నాయనా! యివియేమని" యామె కుమారునడిగెను. అయ్యవారు గొట్టిన దెబ్బలని యేడ్వ మొదలిడెను. కన్నతల్లికా వాతలు దన హృదయముపైననే యున్నటు లైనది. ఆమె గుండె చెఱువై పోయెను. ఇంట బందుగులుగూడఁ గొట్టెదరని పిల్లవాఁడనెను. "ఊపిరియున్న నుప్పమ్మకొని బ్రతుకవచ్చును. ఊటుకూరికిఁ బోకుమని" తల్లి యూరార్చెను. ఆ మాటలు వాని చెవుల కమృతప్రాయము లయినవి.

స్నానానంతరము దల్లి భోజనమునకు రమ్మని పిలిచెను. చెన్నకేశవుని సేవించి వత్తునని పిల్లవాఁడనెను. ఆతల్లి కామాట యమితాశ్చర్యమును గలిగించెను.

నారాయణుఁడు గుడికిఁబోయెను. మువ్వంకలతో వేణువు నూదుచున్న చెన్నకేశవుఁడు బాలుఁడైన నారాయణుని

కొఱకే యెదురు చూచుచున్నటు లుండెను. నారాయణుఁ డాలయమునకుఁ బ్రదక్షిణములు జేసెను. వాఁడు ప్రదక్షించునపుడు వెనుక నెవరో దనవెంటఁ వచ్చుచున్నట్లు బొడకట్టెను. ఆమె మూర్తిమతి సరస్వతీదేవి. చెన్నకేశవుని యానతితోఁ దనయందావిర్భవింపఁ బోవుచున్నది. పిల్లవాఁడు గుడికి మువ్మారు బ్రదక్షిణముఁజేసి చెన్నకేశవుని యెదుట నిలువఁబడెను. చేతులు జోడించి చింతలమ్మ దనకుఁ జెప్పించి నట్లు "స్వామీ!, నాకు విద్య, విద్య, విద్య" యని మూఁడు మారు లనెను. తనవెంటనంటి గుడిసుట్టిన స్త్రీమూర్తి దన్నావేశించుచున్నటులైనది. లోపలనుండి చెన్నకేశవుఁ 'డనుగ్రహించితి' నన్నట్లు వినిపించెను.

ఆ సరస్వతి యావిర్భూతియందు నారాయణుని శరీర మాపాదమస్తకము కంపమాన మయ్యెను. శిరస్సునం దేదియో కమలమువంటి యొక పదార్థము ముక్తసరిగా విచ్చుకొనుచున్నటు లైనది. అదియే సహస్రారము. ఆ కమలమే సకలవిద్యల కధిష్ఠానము. హఠాత్తుగ వానిభావములు సముద్రమంతటి విశాలములైనవి. నారాయణుని హృదయమం దంతయు నెవరో దేనెవంటి యొక మధుర పదార్థము నమృతముఁ జిలికించినటు లుండెను. ఆ విద్యలబరువున నొక క్షణకాలము వానిశిరస్సు వణకినటు లయ్యెను. చెన్నకేశవునకు విజ్ఞాన గంభీరముగ నమస్కరించి నారాయణుఁ డింటికి వచ్చెను.

మరునాఁ డుదయమునఁ బిల్లవాఁడు మేల్కొని 'జట' మొదలుపెట్టెను. విఠలుని యెదలో నా జటయొక్క నాదము

వేయివీణలు మ్రోగినటు లైనది. దగ్గరకువచ్చి నారాయణుని గొన్ని పనస లడిగెను. నారాయణుఁడు వానికిఁ బదమును, గ్రమమునుజెప్పెను. నారాయణుఁడు యజుర్వేదము, సామ వేదము బఠించుట విని తండ్రి యానందవికలుఁడై యూరివారిని బిలిపించెను. ఆ యూరిపండితులుఁ దర్కమున నారాయణుని బరీక్షించిరి. వ్యాకరణమునఁ బ్రశ్నించినంతఁ బూర్వపక్షములు వారి కర్థమేగా లేదు. షడ్దర్శనములు వాని జిహ్వారంగమున నాట్యాకాండ్రవలెఁ దాండవించెను. వానికవిత యనర్ఘమై యుండెను. విఠలుని యానందమునకు మేర లేదు. నారాయణుని తల్లి సంతోషముతోఁ బొంగిపోవుచుండెను.

"వీని కింతచదు వెట్లువచ్చినది?" ఇది విఠలుని ప్రశ్నయు, నూరివా రందఱి ప్రశ్నయు. అంతట నాతఁ డందఱి ప్రశ్నలకు సమాధానముగా నూరియందున్న చెన్నకేశవునిఁజూపుచుండెను. నారాయణుఁడు విద్యావంతుఁడని దేశదేశాంతరములఁ బ్రసిద్ధిఁ గాంచెను.

ఆ నారాయణున కొక కుమారుఁడు జన్మించెను. వాని పేరుగూడ నారాయణుఁడే. ఆతఁడు జిన్ననాటినుండియే దన తండ్రి దగ్గర జక్కఁగా విద్యాభ్యాసము గావించెను. అతత సకలవిద్యా ధురంధరుఁ డన్న కీర్తిని నారాయణుని పుత్ర రత్నము సంపాదింపగలిగెను. కుమార నారాయణునకు దండ్రి వివాహ మొనరించెను. కన్యపేరు లక్కమాంబ. ఆమె సౌందర్యవతి, వినయవతి. కుమారనారాయణుని యత్తమామల యూరు మాడుపూరు. ఆగ్రామము తాళ్లపాకకు సమీపముననే యుండెను. ఆ యూరియందలి మాధవస్వామి, లక్కమాంబ

కపుడపుడు దర్శనమొసఁగి సంభాషించు చుండెనఁట. కొంత కాలమైన తరువాతఁ దండ్రియగు నారాయణుఁడు గతించెను.

లక్కమాంబతోఁ గుమారనారాయణుని సంసారమానందమయముగా నుండెను. ఊరివారంద ఱాదంపతులను-లక్ష్మీనారాయణులవలె గారవించుచుండిరి. కాని బ్రహ్మదేవుని సృష్టి విచిత్రమైనది. లోకమున నెవ్వరికిఁగాని సకలలక్షణము లమరియుండవు. లక్కమాంబకు గొంతకాలము గడచినను-గుమారుని ముఖారవిందమును జూచునంతటిభాగ్యము గలుగ లేదు. పుత్రసంతానము గలుగలేదని నారాయణునకును జింతగా నుండెను. దంపతులిరువురును దైవభక్తిపరు లగుటచేఁ బరమాత్మునే సంతానమునకై వేడుకొనుతలఁపు వారికిఁ గలిగినది. వెంటనే లక్కమాంబయు, నారాయణుఁడును దిరుపతికిఁ బ్రయాణమైరి.

కొన్నాళ్ళకుఁ గతిపయ ప్రయాణములలో వారు దిరుపతిఁ జేరినారు. ఆపదమ్రొక్కులవాని కేటికోళ్ళు సెల్లించి కులవర్ధనుఁడగు కుమారుఁడు గావలెనని వారు స్వామిని వేడికొనిరి. ఆరాత్రి నారాయణునికిఁ గలలో వేయినామముల వాఁడు వేంకటేశ్వరుఁడు గానుపించెను. కనుపించి తనహస్తముననున్న ముప్పిడికటార మొసఁగి యదృశ్యుఁడైనాఁడు. నారాయణుఁడు వెంటనే గన్నులు దెఱచి చూచెను. సంతోషాతిశయమున 'లక్కమాంబ' నాతఁడు మేల్కొలిపెను. లక్కమాంబ వెంటనే లేచి, తనను మేల్కొల్పుటకుఁ గారణ మడిగెను. ఆతఁడు దనస్వప్నవృత్తాంతమును వినిపించెను. ఆమె కర్థముగాలేదు. లక్కమాంబ గర్భమున నందకాంశమున

గుమారుఁడు గలుగునని భర్త తనకలలోని కట్టుకతను దెల్పెను. లక్కమాంబ మందహాసముఁ జేసెను. భర్తయు సంతోషమునుఁ గన్పఱచెను. ఇంతలోఁ బ్రాతఃకాలమును సూచించుచు వృక్షాగ్రములయందలి పక్షులు రొదలుసేయ నారంభించెను.

దంపతులిరువు రూరి కిరుదెంచిరి. తరువాతఁ గొన్ని రోజులలోనే లక్కమాంబ గర్భవతియైనది. స్వభావముగనేఁ సాత్విక ప్రకృతి గల లక్కమాంబ కపుడు నందకధరునిపై భక్తి యినుమడించెను. దినదినమును నిద్రయందు దేవతలెవరెవరో దివ్యసాక్షాత్కారముల నొసఁగుచుండిరి. ఇంతలో నవమాసములు నిండినవి. ఒకానొక శుభలగ్నమున నామె పూర్ణిమ నాఁటి చందురునివంటి గుమారుని గనెను. నారాయణుఁడానందమున మిన్నందెను. తనకుమారున కాతఁ 'డన్నమయ్య' యని నామకరణ మొనరించెను.

తల్లియైన లక్కమాంబ వానిని వింతవింత పేరులతో బిలువసాఁగెను. ఒకసారి 'అన్నయ్యా!' యనును. మఱి యొకసారి 'యన్నప్పా' యని ముద్దాడును. మఱియొకపరి 'యన్నమాచార్య' యని చేతులఁ జాచును. ఆ పాపనితో నామెకుఁ బ్రొద్దు చాలకుండెను. పూటకు రెండుసారులు స్నానమాడించును. కన్నులయందుఁ గాటుకలు దీర్చితీర్చి దిద్దును. 'కాటుక పెట్టినఁ గన్నులు పెరుగునుగదా! నేఁడెంత పెరిగిన' వని దినదినమును గన్నులను భరికించును. నిటాలమునఁ జుక్క పెట్టి — దానిసమీపమున జేరుచుక్క నిడును. రెండు చెంపలపై రెండుజుక్కలిడి — మార్చిమార్చి చెంప ముద్దిడును. అన్నమయ్యకుఁ జేసిన యుపచారమే తనజీవితమునకు ధన్యతయని

తలఁచెను. ఈరీతి నామె కాబాలునితోడి లోకమే లోకము. నారాయణుఁ డింటికి దివ్వెగా వెలుఁగు సుమారుని మొగము జూచినపుఁడు శేషగిరీంద్రుఁడు దలఁపునకు వచ్చుచుండెను. కుమారుని జన్మమువలన లక్కమాంబగృహమొకపాలసముద్ర మైనది.

అన్నమయ్య యొక విచిత్రమైన శిశువు. అతఁడు నంద కాంశమున జన్మించినవాఁడు గదా! చిన్ననాఁటినుండి పరమ పదనాథుని భక్తియే వానిజీవనమైనది. తల్లి యుగ్గు బెట్టఁ బోవును. ఆ శిశువు నోటఁ దెఱువఁడు. తల్లి "నాయనా! యిదిగో దిరుమలప్పని ప్రసాదము. దీనిని గ్రహింపు"మని పలుకును. వాఁడు వెంటనే గేరింతలతో నోరుదెఱచి - యా యుగ్గును గుటుక్కున మ్రింగివేయును. పిల్లవాఁ డేడ్చు చుండును. తల్లి "నాయనా! నీవేడ్చిన వేంకటపతియాన" యని పలుకును. అన్నమయ్య - యేడుపుమాని చిఱునవ్వునవ్వును. లక్కమాంబ - "తండ్రీ! వేంకటప్పకు జోత లిడు" మనును. వెంటనే గుమారుఁడు - రెండుచేతులు జోడించి జోతలిడును. చేర్చఁబడిన యాకరతలములు బద్మముకుళములవలె భాసించును. ఒకప్పుడు చిఱునవ్వు సూచించును. మఱియొకప్పుడు ఆలోచనా పరుఁడైన ట్లుండును. ఆ భావములన్నియు వాఁడు - శేషగిరి నాథునితో నాడుకొను నాటలు.

బాలుఁడు దినదిన ప్రవర్ధమానుఁ డయ్యెను. అప్పటికయి దేండ్లునిండెను. అక్షరాభ్యాసముజరుపకముందేవానికక్షరములు వచ్చెను. జన్మాంతరమునందలి వాసనలు బిలువకయే వచ్చి నట్లు సమస్తవిద్యలును వానిని వలచి వచ్చినవి. చిన్ననాటి

నుండియే యన్నమయ్యకుఁ గవిత్వధార యలవడినది. 'ఆడిన మాటయెల్ల నమృతకావ్యముగను - బాడినపాటలెల్లఁ బరమ గానముగను' నైనవి. బాల్యమునుండి యాతఁడు శేషాచలాధీశునిపైఁ గీర్తన లల్లుచుండెను. తండ్రియగు నారాయణుఁడు కుమారునివిద్యకై యెక్కువశ్రద్ధ తీసికొనలేదు. వాని కెట్లును జదువు వచ్చుననియు - వాఁ డొకమహాపురుషుఁ డగుననియు నాతని నమ్మకము. అన్నమయ్యకుఁ దరువాత వారికి మఱియొక సుతుఁ డుదయించెను. అన్నమయ్య తా నేపని జేయుచున్నను దనకర్తవ్య మదిగాదని వానికి దోఁచుచుండెను. తనబంధువులతో దనకు సంబంధమున్నట్టులే యన్నప్పకుఁ దోఁచెడిదికాదు. తల్లిదండ్రులపైఁ గూడ వాని కంత మమత లేకుండెను. శేషగిరివాసుఁడే దనయాప్తబంధువైనట్లును, శేషశైలమే దననివాసస్థానమైనట్లును - వానిహృదయ మెల్లప్పుడును జెప్పుచుండెడిది. వెంకటాచలపతి వియోగము - వానికి నానాటికి దుస్సహమగుచుండెను. ఇంటిపనులుగూడ జాలభారమయ్యెను. "ఈయింట నున్నవారందఱు నా కేరీతిబాంధవులు! ఈతల్లిదండ్రులనుమాట కర్థమేమి! నే నెటనుండి వచ్చితిని? నేను మరలఁ జేరవలసిన స్థానమేది?" ఈప్రశ్న లన్నమార్యుని నిరంతరము గలవరపెట్టుచుండినవి.

పొలమున నొకనాఁ డా యన్నమయ్య గడ్డిఁగోయుచుండెను. లక్ష్యముదప్పికొడవలితోఁ దనవ్రేలిఁ గోసికొనెను. దాసపుబూవులఁ గేరింతలాడు నెఱ్ఱనిరక్తము జల్లుమని వెలికివచ్చినది. నొప్పిసోకగా యన్నమయ్య హస్తమువైపుఁ జూచుకొనెను. వ్రేలు తెగినది. వానిమనసున నేయేభావనములు జెఱలాడినవో! కొడవలి న్నావలకు బాఱవేసినాఁడు. వెంటనే యటనుండి

శేషాచలమునకు దారిబట్టెను. దారినడచుచు నిట్లాలోచించుకొనెను. "శరీరములు కర్మకల్పితములు. కర్మవశుఁడైన దేహికిఁ దల్లిదండ్రులెవ్వరు? ఆప్తులెవ్వరు? భవబంధములు వదలించు సర్వేశ్వరుఁడు దక్క దేహికి వీరెవ్వరు నాప్తులు గాఁజాలరు. నామనోనాథుఁడగు వేంకటేశ్వరుని దర్శించువఱకు నేను దిరిగిరాను. తరువాతమాత్రము రావలసినపనియేమున్నది?"

ఆ పిల్లవానికి బాహ్యజ్ఞానమే లేదు. ఎవరో దన్నావేశించినట్లు వాఁడు నడచుచుండెను. ఈ సంఘటన జరుగునాటి కన్నమాచార్యుని వయస్సు బదునాఱు సంవత్సరములు.

అట్లు బ్రయాణించిన యన్నమయ్య దిగువ తిరుపతిని దర్శించెను. ఆజానుబాహుఁడై-శతపత్రాక్షుఁడై-బవళించియున్న గోవిందరాజస్వామిని జూచినంతనే యన్నమయ్య కమితానందము గలిగెను. హృదయమున నిలిచి తన్నెవరో బాడుమన్నటులైనది. చల్లని కంఠముతో - యన్నమాచార్యులు వేంకటేశ్వరుని రూపాంతరమగు గోవిందరాజస్వామికీర్తనముల రెంటిఁ బాడెను.

వరుసజనముతో నన్నమయ్య గలిసి కొండనెక్కనారంభించినాఁడు. ప్రాభాత మందమారుతాంకూరము లెప్పటికప్పుడాతని శ్రమ నపనయించుచుండినవి. తొలుత నన్నమాచార్య 'లడిపడి' ని సందర్శించెను. అయ్యడిపడి దగ్గరనున్న-నరసింహస్వామి కేటికోళ్ళుఁ జెల్లించెను. తరువాత 'దలయేరుగుండు' ను దరిసెను. ఆశిల నన్నమయ్య తనతలతో-మోకాళ్ళతోఁ దాకి మ్రొక్కుకొనెను. కొండమీఁద కెక్కువారును - దిగువారును -

దలనొప్పి - కాలునొప్పి - గలుగకుండుటకై యూగుండునుదాకి నమస్కరింతురఁట.

పిమ్మట నన్నమాచార్యుఁడు 'శ్రీపాదము' లను గనుల కద్దికొనెను. ఈ 'శ్రీపాదములు' చాల పవిత్రమైనవి. వీనిగాథ విచిత్రమైనది.

ఒకప్పుడు శ్రీ రామానుజులు 'దిరుమల' ను సందర్శింప విచ్చేసిరి. స్వామిసన్నిధిని మూన్నాళ్ళు నెలకొని యాపైని దిగువ తిరుపతిలో నొకవత్సరము వసించిరి. 'తిరుమలనంబివారి కడ' రామాయణ రహస్యార్థములు దెలిసికొనిరఁట. 'తిరుమల నంబి' గారు కొండపైన స్వామిసన్నిధిని నివసించుచుండిరి. తిరుమలనంబి ప్రొద్దుట స్వామిని సేవించి కొండదిగి 'యడిపడి' కడ దలయేరుగుండు దగ్గరిమంటపమునకు రాగా రామానుజులు గోవిందరాజ సన్నిధినుండి యక్కడికరిగి రహస్యార్థములఁ దెలిసి కొనుచుండెడివారు. ఒకనాఁడు 'దిరుమలనంబి' ముఖము ఖిన్నముగ నుండెను. అందులకు గారణమేమని 'రామానుజు' లడిగినారు. ప్రతిదినము నియ్యెడకు వచ్చుటవలన నాకు వేంకటేశ్వరుని మధ్యాహ్నకాలపూజ దప్పిపోవుచున్నదని యా భక్తుఁడనెను. ఆనాఁటిరాత్రి స్వామి దిరుమలనంబికి గలయందు గనపడి 'నేఁటినుండి నీకాకొఱఁతదీఱుతె'మ్మని హెచ్చరించిరట. మఱునాఁడు స్వామికిఁ బ్రాతఃకాలపూజఁ గావించి తిరుమలనంబి కొండదిగివచ్చెను. రామానుజులును దిరుమలనంబియు రామాయణార్థ విచారమును గావించుకొనుచుండిరి. మధ్యాహ్నపూజా సమయమునకు సరిగా దివ్యకుసుమ తులసీ మృగమద కర్పూరసుగంధములతో స్వామిపాదము లటఁ

బ్రత్యక్షములైనవి. తదాది శ్రీపాదముల కక్కడఁ బ్రతిష్ఠ కలిగెను. 'ఇతిహాసమాల' యను వైష్ణవగ్రంథమునం దీ కథ గలదు.

ఆ యన్నమయ్య వేంకటేశ్వరుల పాదములుదాకుచున్నప్పుడు అదియేమో దివ్యానుభూతియొకటి యాయెడఁదకుఁ గలిగెను. ఎన్నికల్పములనుండియోఁ దనకుఁ బరిచితమైన యొకపదార్థము యెన్నివర్షములనుండియో దాను గోల్పోయిన యొక మహానిధి మరల నానాఁడు దొరకినట్లైనది. మరల నాపాదములఁ గన్నుల కద్దికొనెను. మరల వక్షమున కద్దికొని పరమానందము నందెను.

ఆ శ్రీపాదములు సేవించినంతతడవు నన్నమాచార్యుల కనులనిండ బాష్పములే బాష్పములు. వానిలో నా శ్రీపాదములు సంపూర్తిగా సక్తములైపోయినవి. అది దుఃఖమో యానందమో ! సుఖదుఃఖముల పొలిమేరలను గడచనిన యొక మధురానుభూతియని వచింపకతీఱదు.

మరల నన్నమయ్య కొండనెక్కినాఁడు; అతఁడు 'గుమ్మరి మండపము'ను దరిసెను. పూర్వకాలమున 'గురువనంబి'యను నొక మహాభక్తుఁ డుండెను. ఆతఁడు స్వామికిఁ బ్రతిదినము వంటకుండలు జేసి యిచ్చుచు దాని యాయితిచే జీవించుచుండెను. ఆపనిలో నాతనికిఁ దీరికయే దొరకుటలేదు. అందుచే వానికి స్వామిదర్శనము దఱచు లభింపకుండెను. కొయ్యతో శ్రీనివాసమూర్తిని గల్పించికొని వాఁడు గుండలుసేయఁగా మిగిలినమట్టితో నామూర్తి నర్చించుచుండెను. ఆ కాలమునఁ దొండమానుఁడను రాజొకఁడు గలఁడు. ఆతఁడు బ్రతిదినము

శ్రీనివాసునకు బంగారుపూలతోఁ దొలిపూజ జరుపుచుండెను. ఒకనాఁడు స్వామిపాదములపై నర్పించిన బంగారుపూవులొక వైపున కొరఁగియుండెనఁట. మట్టిపూవులుస్వామివారి శ్రీపాదములపై నుండెనఁట. రాజునకమితాశ్చర్యము కలిగినది. దీనికిఁ గారణమేమని విచారింపఁగా గుమ్మరి తనయున్న చోట నర్పించుచుండిన పూవు లవియగుట దెలియవచ్చెనఁట. రాజు కుమ్మరిని దరిసి దన కట్టియోగ్యతఁ బ్రసాదింపుమని యర్థించెనఁట. అహంకారవిముఖుఁడైన రాజునకును, గుమ్మరికి నేకత్ర శ్రీ వేంకటేశ్వరుఁడు సేవనొసఁగెనఁట. అన్నమయ్య యామండపమునఁ గూరుచుండి తానింతకుముందుఁ బెద్దలచేవిన్న కురువనంబి వృత్తాంత మంతయు నెమరువేసికొనెను.

అన్నమయ్య 'మోకాళ్ళముడుపు' ను సమీపించినాఁడు. ఇఁకఁ బైనున్న పర్వతమంతయు సాలగ్రామమయమఁట. అందుచే బూర్వమున మహాభక్తు లటనుండి పాదములతో భూమిని స్పృశింపక మోకాళ్ళతోఁ గొండపైకి నెక్కెడివారఁట. అన్నమయ్య కావృత్తాంతము దెలియదు. అతఁడు దనకాళ్ళయందుఁ జెప్పులు ధరించి యుండెను. మోకాళ్ళముడుపు నన్నమయ్య దరియునప్పటికి జాము ప్రొద్దెక్కినది. ఆతఁడు చాల బడలియుండెను. ఆకలియుఁ బ్రారంభమైనది. అందుచే నన్నమయ్య యొక వెదురుపొద క్రింద బండుకొని యాదమఱచి నిద్రింప దొడఁగినాఁడు. కలలో నలమేలుమంగ వానికి దర్శనమిచ్చి "నాయనా! ఈ పై పర్వతమంతయు సాలగ్రామమయము. దీనిని జెప్పుల కాళ్ళతో నెక్కరాదుసుమా!" యని మందలించెను. ఆమె

భక్తపరతంత్ర. ఆకలితోనున్న అన్నమయ్యకు వేంకటేశ్వరుని దివ్యప్రసాదము నొసఁగెను. అన్నప్ప వెంటనే గన్నులుదెఱచి చూచినాఁడు. ఆశ్చర్యకరముగా నప్పములు మొదలగు మధుర పదార్థము లెదుటనుండినవి. ఆనందమున మేను మఱచిన యన్నమయ్య యాశువుగా మహాలక్ష్మిపై నొక శతకముఁ జెప్పెను.

అన్నమాచార్యుఁడు వేంకటేశ్వరుల సన్నిధికిఁ జేరెను. స్వామిపుష్కరిణియందు మనదమార స్నానముగావించి యాది వరాహున కేటికోళ్ళు సమర్పించెను. తరువాత చంపక ప్రదక్షిణము సలిపి బంగారువాకిండ్లు గనుల కద్దికొని శేషాద్రినాథుని సన్నిధియందుఁ బ్రవేశించెను. ఎదుట నిలువఁబడియున్నాఁడు యుగయుగాలనుండియు నిలుచుండి యున్నను నలఁత గలుగని స్వామి. వానిచేతుల శంఖచక్రములు, బొడ్డున మానికము, కాంచనాంబరము, మణిమయకుండలద్యుతులు దెసలు బ్రకాశింపఁజేయుచుండెను. మంచిముత్యాల నామముపై దీపించు రత్నాంశు పరివిష్ట కిరీటము వేయిసూర్యుల ప్రకాశము నపహసించుచుండెను. వైజయంతి వ్రేలాడుచు "భక్తులరక్షింప నేను సిద్ధ" మనుచున్నట్లుండెను. ఆ స్వామి మోహనందము గరువునఁ బోసినట్లు సనకసనందాది మహామునుల తపస్సు గండరువైనట్లుండెను. ఆయర్చావతారము నెదుట నన్నమయ్య సాగిలపడి మ్రొక్కినాఁడు. యాత్రికులను బూజారులు బొమ్మని యదలించుచుండిరి. ఆ సవ్వడి యన్నమయ్య చెవి సోకనే సోకదు. స్వామి తీర్థము నాతఁడు గనులకద్దికొని స్వీకరించెను. శఠారి యొసఁగిరి. 'పొండు పొండ' న్న పూజారుల సవ్వడి మఱల గగనమంటప మంటుచుండెను. అన్నమయ్య

గ్రుడ్లయందు నీరుదిరిగినవి. బలవంతముగఁ దన కన్నతల్లి నుండి తన్నెవరో వేరుచేయుచున్నట్లాతనికిఁ దోఁచెను. చేయునది లేక నా స్వామిని దిరిగి తిరిగి చూచుచు నాతఁడు బయటికి వచ్చెను.

అన్నమయ్య కూరికిఁబో మనసుపుట్టదు. ఆ దివ్య క్షేత్రమునందే యాస్వామి శ్రీపాదముల చెంతనే జీవితమును గడుపవలెనని యాతని మనోనిశ్చయము. అన్నపానముల గొడవయే వానికిఁ బట్టదు. నిరంతరము ధారావాహినిగా సంకీర్తనముల రచించును. పరమాత్మ నొత్తిలి [illegible] బాడును. ఆనందపరవశుఁడై ప్రియుని వలచిన మోహనాంగి వలెఁ దనకుఁదాన యాడును. అమృతమును బానము సేయుచున్నట్లు మాటిమాటికి భగవానుని నామమంత్రమును జపించును. భక్తియే వాని జీవనాదర్శము.

ఒకానొక నాఁటి వేకువను స్వామిదర్శనమున కన్నమయ్య వచ్చెను. అప్పటి కింకను సన్నిధితలుపులు వేయబడి యుండెను. ద్వాదశోర్ధ్వపుండ్రములతో నర్చకులు బయటఁ బచారు సేయుచుండిరి. బాల్యచాపల్యమున నన్నమయ్య "ఇంకను దలుపు దీయరే" మని యర్చకులలో నొకరి నడిగెను. ఆ యర్చకులు ధనమదమత్తులు. ఆ నంబి కన్నమయ్య యొక పురుగుకైవడి గానఁబడెను. "నీ వెవ్వఁడ వడుగుటకు! కన్నులు నెత్తికెక్కెనవా! గుడితలుపులు దీయువఱ కెవ్వరును లోపలికి రాకూడదు. బయటికి నడువు" మని యర్చకుఁడు గద్దించెను. ఇఁక నన్నమయ్య కెవరుదిక్కు! సర్వశరణ్యుఁడు భక్తులకు భక్తుఁడైన శ్రీవేంకటేశ్వరుఁడే. అన్నమయ్య వేంకటేశ్వరునిపై

బద్యములు సెప్ప నారంభించినాఁడు. విచ్చేఁడు పూలవలెఁ దలుపులు వెంటనే విచ్చికొనెను. అర్చకు లాశ్చర్యపరవశులైరి. ఇంతకు మునుపు గద్దించిన పూజారి యన్నమయ్యను క్షమాపణ వేడికొన్నాఁడు. నాఁటిబాలకుఁడైన యన్నమయ్యయటనెల్లరకు గౌరవపాత్రుఁడయ్యెను.

ఆ కాలమునఁ దిరుపతి యం దొక మహాభక్తుఁ డుండెను. ఆయన నామధేయము 'ఘనవిష్ణుఁడు'. ఒక నాఁడు శేషగిరినాథుఁ డాతనికిఁ గలయందు సాక్షాత్కరించి "ఓయీ! ఈ యూరఁ దాళ్ళపాకనుండి వచ్చిన యొక చిన్నవాఁ డున్నాఁడు. వానిపే రన్నమయ్య. ఆ చిన్నవాఁడు నాకుఁ బరమభక్తుఁడు. వాఁడు ముందుముందు సంకీర్తనాచార్యుఁడై దన యఖండరచనలచే నాకీర్తిని లోకమున వెలయించును. వానికి నీవు ముద్రాధారణము సేయు" మని పలికి తనముద్రికల నిచ్చి యంతర్ధానమయ్యెను. మఱుదినమున ఘనవిష్ణుఁ డా బాలుఁ డెవఁడై యుండునని వెదకి తుద కన్నమయ్యను కనుఁగొనెను. ఘనవిష్ణునిచెంత నన్నమార్యుఁడు ముద్రాధారణమంది పంచసంస్కారములు బడసినాఁడు. నాఁటి నుండి యన్నమయ్య వైష్ణవుఁడై యన్నమాచార్యుఁడైనాఁడు.

అన్నమయ్య యిలువీడినప్పటినుండియుఁ దల్లియగు లక్కమాంబ విచారమున కంతములేదు. కానక కన్న సంతానముగావున నామెకడుపు చెఱువగునట్లు శోకించెను. కనుపడిన యెఱుకసానులను 'గద్దె' లడుగుటకుఁ బ్రారంభించెను. ఆలయములకు బ్రదక్షిణములుచుట్టెను. బ్రాహ్మణులతోఁ గుమారుఁడు మఱల నింటికి రావలెనని పారాయణములు సేయించెను.

జపములు సేయించెను. తానును జపములు గావించెను. కనుబడిన రాతికెల్ల మ్రొక్కి తనకుమారునిఁ దెచ్చియిమ్మనెను. కన్నతల్లి ప్రేమ కన్నతల్లికే తెలియునుగదా!

తండ్రియగు నారాయణుఁడును కుమారుని పోకడలు గుర్తించుటకై నానావ్యథలు బడెను. బందుగులున్న గ్రామములకన్నింటికి వార్తలంపించెను. మిత్రులున్న యూళ్ళకుఁ గబురంపెను. దారిఁబోవుచున్న ప్రయాణీకులందఱితో కుమారుని యానవాళ్ళు సెప్పి యట్టి పిల్లవాఁడెక్కడనైన గనుపించిన గబురంప వలసినదని ప్రార్థించెను. కడ కెట్లో యాదంపతులకుఁ దమ కుమారుఁడు దిరుపతియందు స్వామిసన్నిధియందున్నాఁడని గబురు వచ్చినది. వర్తమానము రాఁగానే యాదంపతులు దిరుపతికి టెక్కలుగట్టుకొని వ్రాలినట్లు శీఘ్రముగఁ జేరికొనిరి. అన్నమాచార్యుఁడు స్వామియాలయమునరూపెత్తిన వైష్ణవమువలె వారికి గోచరించినాఁడు. తల్లియగు లక్కమాంబ సంభ్రమముతో కుమారునిఁ గౌగిలించుకొని కనులబాష్పములను రాల్చెను. తండ్రియగు నారాయణుఁడుగూడ గంటఁ దడివెట్టికొనెను. అంతలనింతలనున్న యర్చకు లీదృశ్యమును జూచి వారిని సమీపించిరి. ఆ దంపతులే యన్నమాచార్యుల తలిదండ్రులని దెలిసికొన్నపు డాయర్చకుల గౌరవప్రపత్తులకు మేరయే లేదు. వారాదంపతులకు సాష్టాంగనమస్కారము లాచరించి అన్నమాచార్యుఁడు మహానుభావుఁ డని పలికి యాతఁడు జూపిన మాహాత్మ్యమును విన్నవించిరి. అట్టి కుమారునిఁ గన్న మీరుగదా యుత్తమోత్తములని వారిని బూజించిరి.

తండ్రియగు నారాయణుని యానందమునకు మేరలేదు. కుమారునికీర్తిని వినుచున్నపు డాతనిహృదయమునందుఁ గామధేనువు నిలిచి పాలుస్రవించుచున్నటు లుండెను. లక్కమాంబ కానందమువలన బాహ్యస్మృతియే లేదు. కాని యన్నమయ్యకు మాత్రము దల్లిదండ్రులను జూచినపు డెట్టి మార్పును గలుగలేదు. తనచుట్టునున్న యితరులవలెనే వారి నాతఁడు చూచెను. ఇతరులతోఁ దన కేసంబంధమును లేనట్టులే వారితోడను దనకు సంబంధము లేదని తలఁచెను. తనయాత్మబంధు వాయర్చావతారుఁడైన శ్రీమన్నారాయణుఁ డొకఁడే. ఈభావము లన్నమయ్య మనసున బ్రోదులుదీరియున్నవి.

తల్లిదండ్రు లింటికి రావలసినదని యన్నమయ్యను బ్రతిమాలిరి. ఆతఁడు దన యిల్లిదియే యని వారికి బదులు చెప్పెను. కడకు గురుఁడగు 'ఘనవిష్ణుఁడే' యిఁక నీవు నీగృహమునకుఁ బోవలసినదని యన్నమయ్య కాజ్ఞవెట్టినాఁడు. గృహస్థాశ్రమమును స్వీకరింపవలసినదనిగూడ యన్నమయ్యకు గురుముఖమున నాజ్ఞయైనది. అన్నమాచార్యుఁడు గురువాక్యమున కడ్డుచెప్పలేకపోయెను. కడపటిసారి దనయిష్టదైవమగు వేంకటనాథుని మనసార సేవించుకొని యన్నమాచార్యుఁడు స్వగ్రామమునకుఁ జేరికొనెను. తరువాత గొలఁదికాలముననే యన్నమాచార్యుఁడు గృహస్థుఁడయ్యెను. అనురూపవతియగు భార్య యాతనికి దొరకినది. తండ్రివలెనే యన్నమయ్య మడకఁబట్టెను. వేంకటేశ్వరునిపైఁ బదములను బాడుచు, వ్రాయుచునే యుండెను.

అన్నమాచార్యుఁ డొకసారి యహోబిలక్షేత్రమును సేవింపనేగెను. అప్పు డచట శఠగోపముని సన్నిధిసేసి యుండెది. వారికి స్వయముగ నహోబిలనృసింహుఁడు ప్రత్యక్షమై నారసింహచక్రాదిమంత్రముల దయసేసియుండెను. శఠగోప మునికి నహోబిలనారసింహుఁడే హయగ్రీవ మంత్రము నొసఁగెను. ఆ మంత్ర ప్రభావమున శఠగోపయతి సకల విద్యానిధి యయ్యెను. అన్నమాచార్యుఁడు శఠగోపమునిని దన గురువుగ స్వీకరించి వారి సన్నిధానమున సకలవేదాంతపఠనము గావించెను. మహితమగు నష్టాక్షరీ మంత్రమును ద్వయమును శఠకోపమునియే యన్నమార్యునకుఁ బ్రసాదించిరి. గురుకరుణ నొందిన యన్నమార్యుఁడు స్వగృహమున కరుదెంచినాఁడు. నాఁటినుండి యన్నమయ్య రామాయణమును సంకీర్తన రూపమున వెలయింప నారంభించెను. ఆ సంకీర్తనలు విన్న జనులందఱు నీతఁడు నారదుఁడో, దుంబురుఁడోగాని సామాన్య మానవుఁడు గాఁడనుచుండిరి. ఊరూర నాతని కీర్తనలు మారుతాంకురములవలె వ్యాపింపసాగెను.

తాళ్ళపాకకుఁ గొలఁదిదూరముననే 'టంగుటూ' రను గ్రామము గలదు. ఈ నాఁడది యొక కుగ్రామము. అన్నమయ్య నాఁటి కదియొక మండల ప్రధాననగరము. విజయనగరరాజుల యేలుబడిలోఁ బ్రతిమండలమున నొక దండనాథుఁ డుండెడి వాఁడు. ఆనాఁడు టంగుటూరిమండలమునకు సాళువ నరసింహ రాయఁడు ప్రధాన దండనాయకుఁడుగా నుండెను. అతఁ డన్నమాచార్యుల కీర్తి ప్రతిష్ఠలు విని యాందోళికలఁ బంపి సగౌరవముగ నాతనిని దనచెంతకు రప్పించుకొనెను. అన్నమాచార్యుల కీర్తనలువిని సాళువ నరసింహరాయఁడు

బరమసంతోష భరితుఁడై నాఁడు. ఆ దినమునుండి నరసింహ రాయలకు నన్నమార్యునకుఁ గూరిమి బెరిగినది. నరసింహ రాయఁ డన్నమయ్యకుఁ జెలికాఁడై దాసుఁడై యుండెను. రాజకార్యములయందు గూడ నన్నమార్యునియాజ్ఞల నాతఁడు బాలించుచుండెను.

ఇంతలో విజయనగరసామ్రాజ్య ముఖ్యపట్టణమగు 'హంపి'లో నల్లరులు బయలుదేఱినవి. విజయనగర సామ్రాజ్యమును విరూపాక్షరాయఁ డా దినములలోఁ బరిపాలించుచుండెను. ఆతఁడు కేవలవిషయాసక్తుఁడు. ప్రజలసుఖ మేమాత్రమును గమనించువాఁడు కాఁడు. ఈ యదను జూచుకొని కపిలేశ్వరగజపతి విజయనగరసామ్రాజ్యముపై దండెత్తినాఁడు. ఈ దండయాత్రలోఁ బ్రజల కలజడియైనది. విరూపాక్షరాయఁడు గజపతితోఁ బోరలేక వానికిఁ గొంతకప్పమిచ్చి వెనుకకుఁ బంపినాఁడు. ఆ కప్పమును జెల్లించుటకై యాతఁడు బ్రజలపై భారమైనపన్నులను విధించెను. ఈ కల్లోలములో వాని పెద్దకుమారుఁడైన రాజశేఖరరాయలు దండ్రియగు విరూపాక్షునిజంపి సింహాసనమెక్కెను. రాజశేఖరరాయని వానితమ్ముఁడగు రెండవ విరూపాక్షరాయలు జంపించి తానుసింహాసనము నాక్రమించికొన్నాఁడు. ఆ భ్రాతృహంత పరిపాలనము సామ్రాజ్యజనుల కిష్టమైనదిగాదు. ఆసమయమును గనిపెట్టి దండనాథుఁడుగా నున్న సాళువనరసింహరాయఁడు రెండవ విరూపాక్షునిజంపి తానుచక్రవర్తియయ్యెను. ఈయుద్ధములును, రక్తప్రవాహములు నన్నమాచార్యుని హృదయము నెంతయో కలఁచినవి. మానవులముష్కరతను నిందించుచు నాతఁ డెన్నియో కీర్తనములను రచించెను.

నరసింహరాయఁడు విద్యానగరచక్రవర్తి యైనతరువాత నన్నమాచార్యులను హంపికి రావలసినదని వేడికొనెను. చక్రవర్తి ప్రార్థనములపై యన్నమాచార్యుఁ డప్పుడప్పుడు విద్యానగరము నకుఁ బోయి వచ్చుచుండెను. అప్పుడచ్చటనున్న యర్చావ తారములపై నన్నమాచార్యుఁడెన్నియో కీర్తనములనర్పించెను. నరసింహరాయఁడు సంకీర్తనాచార్యుఁడగు నన్నమయ్య కెన్ని యగ్రహారములో యొసఁగెను. ఛత్ర చామర రాందోళికాది రాజమర్యాదల నందించెను. నరసింహరాయనిప్రాపుతో నన్న మాచార్యుఁడు కొంతకాలము రాజోచిత సుఖము లనుభ వించినాఁడు.

విజయనగరరాజులకు విద్యానగరమే రాజధానియైనను పెనుగొండ దుర్గము ప్రాణప్రదమైనది. వారు చాలవఱకు ముఖ్యముగా వసంతములలోఁ బెనుగొండయందే వసించు చుండిరి. ఒక వసంతమున సాళ్వనరసింహరాయలు సంకీర్తనా పరుఁడైన యన్నమయ్యను బెనుగొండ దుర్గమునకుఁ బిలిపిం చెను. రాజోచిత మర్యాదలతో సంకీర్తనాచార్యుఁడు బెనుగొండఁ జేరినాఁడు.

ఆస్థానమునఁ బ్రవేశించుచున్న అన్నమాచార్యునకు భూపాలుఁడు శిరముసోఁక నమస్కరించెను. అన్నమయ్య 'శ్రీనివాసో రక్షతా' మని యాశీర్వదించి కానుకగాఁ దిరుమణి నొసఁగెను. నరసింహరాయఁడు 'మహాప్రసాద' మని కన్నుల కద్దికొనెను.

రాయలు వినమితుఁడై యన్నమయ్యను సంకీర్తనము సేయ వేడికొనెను. సంకీర్తనాచార్యుఁడు వేంకటేశ్వరునిపైఁ

గృతులు బాడ నారంభించెను. ఆ కొలువంతయు నాపాటలతో మల్లెలు విరిసినట్లు, కస్తూరిజిలికినట్లు, సుధాప్రవాహములు బారినట్లుండెను. కవులు పదసౌభాగ్యమునకు నర్థపుష్టికి నోడలు మఱచిరి. గాయకులు రాగసౌభాగ్యమున కచ్చెరువొందిరి. భావజ్ఞులు భక్తికిఁ దన్మయియీభావమందిరి. ఈ పుంభావసరస్వతి యాకొలువున నొక కలవలె నుండెను.

నన్నమాచార్యుఁడు వేంకటేశ్వరునిపై నొక శృంగార విలసితమైన పదముఁ బాడెను. ఆ పద మన్ని కీర్తనములకును నాయకమణిగ నుండెను. సభ్యులు దానినే మరల మరలఁ బాడుఁడని ప్రార్థించి విని యానందించిరి.

ఆపదమును విన్న నరసింహారాయల కొకదురాశ జనించి నది. తనపై నటువంటి పద మొకటి యన్నమయ్యచేఁ జెప్పించు కొనవలెనని వానికిఁ దోఁచెను. వెంటనే దనపై నొకపదము బాడుమని సంకీర్తనాచార్యుల నడిగెను. అదివిని అన్నమయ్య రెండు చెవులను మూసికొని భూపాలునితో నిట్లనెను.

"రాజా! నీవు విషము నరగించుకొనఁ జూచుచున్నావు. సకలలోకాధీశుఁడగు వేంకటేశ్వరునితో నీ చెలిలాటము నీకు హితకారి గాఁజాలదు. భగవంతుని వర్ణింపనేర్చిన నా జిహ్వ యెన్నటికిని దదన్యపురుషులఁ బొగడనేరదు. పతివ్రత యేనాటి కైన బరపురుష సంపర్కమును వాంఛించునే? ఇన్ని దినముల నీ చెలిమికిఁ జక్కని గుణపాఠమును నేర్పితివి. ఇదే వెడలిపోవు చున్నాను."

అన్నమార్యుఁడు పీఠమునుండి దిగ్గునలేచెను. నరసింహ రాయని ముఖము రోషరూక్షమైనది. రాజగర్వము త్రాచు

పాము విషమువలె వానిబుద్ధి నాక్రమించినది. అంతట నాతఁ డిట్లు పలికెను.

"ఏమిరా ! మహారాజులకా ధిక్కారము ! నీవు నాపై బదము బాడవలయును గదలుటకు వీలులేదు."

"నాచేత నీపైఁ బదముఁ బాడింప హరినితరము గాదు." అన్నమాచార్యుఁడు హుంకరించెను. నరసింహరాయఁడు వెంటనే సంకీర్తనాచార్యుని బంధింప నానతిచ్చెను. 'మూరురాయరగండని సంకెల' లన్నమాచార్యునిహస్తములకెక్కినవి. ఆ సంకెలలు యుద్ధమునం దోడి చిక్కిన మహారాజులను బంధింప మాత్రమే యుపయోగించుచుండిరి. నిర్బంధమునందు గూడ యన్నమాచార్యులకు రాజమర్యాదయే జరిగినది.

వెంటనే యన్నమాచార్యుఁడు వేంకటేశ్వరునిపై కీర్తన బాడెను. దానియర్థ మిది. వాసుదేవా ! ఆకలిగొన్నవేళ నలసినవేళ నీ దివ్యనామోచ్చారణమేదిక్కు. కాలుమాలినవేళ గులముచెడినవేళ చెఱవడి యొరులచేజిక్కినవేళ నీదివ్యనామోచ్చారణమే రక్షించు నుపాదేయము. ఆపదవచ్చిన నాఁడిబడిన పాపపువేళయందు భయపడినవేళలలోఁ గల్యాణకారియగు నీనామస్మరణమునకన్న వేరుగతి లేదు. చంపవచ్చినవేళ సంకెలలిడినవేళ వేంకటేశా ! నీనామమే విడిపింప దిక్కుగాక మరి యన్యములేదు.

ఈకీర్తన బాడినవెంటనే యాసంకెల లూడిపోయెను. సభాసదులెల్ల రీ యపచారమును భక్తునకుఁ జేయరాదనిరి. కాని రాయలు గర్వాంధతనుండి యింకనుఁ దెప్పిరిల్ల లేదు.

సింహాసనమునుండి స్వయముగ దిగివచ్చి యాతఁడే మరల సంకెలలు దొడిగెను. ఇంకొకసారి యన్నమాచార్యుఁడు దొలుతటికీర్తనమే గావించెను. సంకెలలూడి దూరముగఁ బడి పోయెను. రాజు కన్నులు దెఱచిజూచెను. తనగర్వాంధతను క్షమింపుమని యప్పు డనేకరీతుల నన్నమయ్యాను బ్రార్థేయ పడెను. ఏదియెట్లులైనను రాజులతోడిపొత్తు భక్తులకు క్షేమకరముగాదని తలఁచి సంకీర్తనాచార్యుఁడు దాళ్ళపాకకు వచ్చివేసెను. మరల నాతఁడు మహారాజును జూడనేలేదు.

అన్నమాచార్యుఁడు సంసారభారమును దనయుల కొప్పగించి తిరుపతిఁజేరెను. విరక్తుఁడై వేంకటేశ్వరునిపై బదములల్లుచుఁ దనజీవితశేషమును గడపి పరమపద మందెను.

ఇంకను నన్నమాచార్యుఁడు దనజీవితకాలమున ననేక మహిమలను జూపించెను.

అన్నమాచార్యుఁడు ముప్పదిరెండువేల కీర్తనలను రచించెను. సంస్కృతమునందును గొన్ని యుద్గ్రంథములను రచించినాఁడు. మఱియుఁ బన్నెండు శతకములగూడ వ్రాసినాఁడఁట.

అన్నమార్యుని పదకవిత లమూల్యములైనవి. తరువాతి కవు లెందఱో యాతనిపదసంచయమును, భావసౌభాగ్యమును గొల్లలాడిరి. అన్నమాచార్యుఁడు మహాభక్తుఁడు మహాకవియనుటలో నతిశయ మేమికలుగును ?

సంపూర్ణము

శ్రీ మత్సత్

